# పీఠిక.

1919 సం॥ మున నే నింకను విద్యార్థినై యుండగ నీ నాటకమును కేవలము వినోదార్థము వ్రాసితిని. వ్రాసి నప్పుడు ప్రకటింప నిచ్ఛ లేదు. నా మిత్రుల కొందరి ప్రోత్సాహముచేత నిప్పుడు ప్రకటింప నీయకొంటిని. కాలానుగుణ్యముగ గొన్ని మార్పులు చేయుదమా యని ఆలోచించియు వాఙ్మయపక్షమున లోపమగునని యెంచి అప్పుడు వ్రాసిన దాని నట్లె యుంచితిని.

1923. వి.

నా పంజరంలో ఉన్న ఆ చిల్కలజత నాకన్న సౌఖ్యంగా కాలక్షేపం చేస్తూన్నాయిగదా... (పంజరము దగ్గరికి వెళ్ళి) ఏదీ...అను...ద...య...చే...యం...డీ ఏమీా ఆ అనురాగం. నా పిలుపే వినబడ దిప్పుడు వాటికి. సృష్టి విచిత్రం అంతా ఈ పంజరములోనే ఇమిడి ఉన్నట్టుందిగాని. మీా రలా గుండండీ. మీా సౌఖ్యంకూడా ఎందుకు పాడు చేయడం. కిందటి జన్మంలో ఎవరి సౌఖ్యమో పాడుచేయ బట్టేకదా నిత్య దాంపత్యంలేని ఈ వెలకుల జన్మం ప్రాప్తించింది. ముసిలీ! ముసిలీ! (ముసిలి ప్రవేశించును)

ము—ఏవమ్మా?

ర—నిజమే అంటావా నువ్వు చెప్పినది?

ము—నువ్వోటి ఎర్రిబాగుల్దానివి; మీానాచ్చింటు ఏటంటాది సెప్పు. మీా యక్కయ్య ఎన్నడీ దుగి. లాంటిచారా లెట్టుకోనేదు. నీ కరమ్మంగాని అక్కర్నేని సంకెళ్ళు తప్పించుకొంటూ నంటావేటి?

ర—నాకు బుద్ధి సరిగ్గాలేదు. ఏంచెయ్య మంటావు?

ము—ఏటినేదు. అపిడేలు తెచ్చుకోని పాడుతా కూర్చో. పొద్దు గుంకుతా ఉందీ. సూడటే పెంత ఎర్రగుందో ఆకాచం. ఏటి తల్దువ్వుకోవేటి చరింగాను? మరిన్ని. నవ్వుతా రెవరైన యింటేను. ఇం దీ పువ్వెట్టుకో నల్గు రొచ్చి పొయ్యాక వేల.

ర—ఏమో ... చూడు. మొన్న దీక్షితులుగారు చెప్పిన కృతి పాడుతాను.

ము—మరి దానికి నాట్టియం ఒద్దేటి? సోమయ్యని పిలుత్తానని బుఱ్ఱ బద్దలు గొట్టుకుంటే ఒప్పుకోవుగదా.

ర—విందూ పాడుతాను. (పాట అవగానే తెరదిగును)

---

## రంగము ౨.

---

[రామినాయుని ఇంటి సావిడి. వీధి కనబడుచుండును.]

[రామినాయుడు, వెంకునాయుడు. చదర్లమీద చుట్టలుకాలుస్తు కూర్చుందురు.]

రా—నేనండి బావగోరు. మా రెండోపిల్ల పెద్దకల్లాసుల్లో కొచ్చి నకాడ్నుండీ సంగీతమో అని సంపుతోంది. కొత్తపేట శాస్త్రుల్లో ర్నడుగుతే నలబై రూపాయిలు కావాలంట. బావ నాస కాదండి బావా?

వెం—ఎందుకండి, నలబై? నా యెరిక నోపంతులున్నాడు; ఆయన కింగ్లీసుకూడ వచ్చును.

రా—అనాగత్తే తక్కువలో కుదుర్తాడాం డాయనగోరు?

వెం—నే సెప్తాగదూ కబురు పంపించమన్నా రేటి?

రా—ఇప్పు డొస్తాడా? పంపించండి. ఎర్రా!

[ఎర్రడు ప్రవేశించును.]

వెం—అదిగో ఆయింటికి దాపల్దిక్కు కేసి' ఎర్రటి మేడుంటాది. పేటి. అందులో బాపనయ్య ఉంటా డెర్రగ పొడుగ్గాన్ను; ఎంకునాయుడు సావిట్లో ఉన్నాడు, మిమ్మల్నోపాలి జేగి రమ్మంటున్నాడు అని సెప్పి పారా. నేనంటె తప్పకుండొస్తాడు.

(ఎర్రడు నిష్క్రమి.)

రా—అయితే ఆయనపే రేటండి?

వెం—ఉమాకాంతం. రామయ్యిగ్గర్రోమా దీక్షితులుగా ర్నెరిక నేదా?

రా—నేకేం?

—ఆయిని కొడుకే పో. ఇక్కడ పెద్దపెద్దపరీక్షలకిచదువుతున్నాడు. సంగీతం మా బాగొచ్చును. మంత్రా సూరప్పకన్న బాగాపాడుతాడు. మొన్న నాటకంలో ఒకమెడల్సిచ్చారుకూడాను.

రా—మా పిల్లకూడా సురకయిందేనండి.

వెం—పెళ్ళిషయం ఏటి ఆలోచించే రేటి?

రా—రెండుమూడుసంబంధా లొచ్చాయికానండి డబ్బుదెయ్యం పట్టుకుందం డంసరికీని. అయిదుసంచులికి తక్కువ అడిగినోడే నేడండి.

వెం—చాలా దురన్యాయంగా ఉంది; బాపనోళ్లను చూచే సుమండీ మనోళ్ళు మొదలుపెట్టేరు.

రా—బాపనోళ్లంటే ఆరు సదువుకొన్నోరు; అగిడినా బాగుంటాదికాని మనోళ్లేటి?

వెం—సదువు రచ్చిస్తాదేటి? ఈమాత్రం ఆమాత్రం బూమి సెక్కుంటే ముడెట్టీవచ్చును.

[ఉమాకాంతం ప్రవేశము.]

ఉ—ఏం న్యాయుడూ! నువ్వీవూరు దిగబడ్డావు?

వెం—ఎంత శీగొచ్చినారు? మా మన్సివచ్చి ఏటి సెప్పేడేటి?

ఉ—మీ మన్సెవరు?

వెం—ఇప్పుడు మీకోసం అని పంపించేనండి.

ఉ—నాదగ్గరకు ఎవడూ రాలేదు. ఇలాగ క్లబ్బుకువెళుతూ నువ్వు కనబడితే బండిదిగి వచ్చేను.

వెం—సిత్తం. చూడండి బావ, గవర్రం అంటె బొమ్మలదేనండి.

ఉ—ఎందుకు కబురు పంపించేవు?

వెం—రండికూకుడోండి. అల్లా సదరినా గందుకోండి బావా దీనిమీఁద కూకుడోండి. నిన్ననే బుగత న్యాశాను. చేమంగున్నారు. ఇక్కడ కొంచెం ఎవ్వారాలుండి పైసలేసుకుందారని వచ్చేనండి.

ఉ—ఏది? మొరకపోలం గట్టుతగాయిదా ఏనా, ఏది సంస్థానం వాళ్ల గిజరెక్కొట్టీ శేవుకదూ అందులోను.

వెం—సిత్తం. మీదయండి. అదిన్ని మరికొన్ని కోర్టుతగాయిదాలు నాకు మూమ్ము లేకదండి? ఉన్నా యింకాను. అటిమాట కేం? మీరు చామంగున్నారా?

ఉ—క్షేమంగానే ఉన్నాను.

వెం—నిన్ననే సోడారంనుంచి సంకోరు వచ్చేరు. ఆరిపెద్ద పిల్లనేమో మీ కిత్తామని అనుకుంటున్నారు. బుగతగోరు పిల్లను చూశారు. వా! దీపంనాగుందండి. బాబు మీకు తగిన్దండి. పచుపుకుంకం అమోస్పిల్లగానే పంచగినాడు ఇస్తారంట. మీకూ ఈయాలో రేపో బుగతగోరిదగ్గరనుంచి కబురొస్తాదినండి.

ఉ—ఏమిటీ ఏమిటీ. నాకు చెప్పకుండా పసుపుకుంకం ఊనా? పిల్ల బాగుందీ? నే చూడకుండానే? ఎవరికి బాగుంది? డాం నాన్సెన్సు; నిశ్చయందేనా ఏమిటి నాయుడు?

వెం—ఏమలా గడుగుతున్నారు, కల్యానమూర్తం దగ్గరయి లేను?

ఉ—రెచ్చెడ్న్యూసయిటే. ఏడిసినట్టుంది......సరేలే. మీ నాన్న మాత్రం నాకు చెప్పకుండా ఏంపని చేయడు...సరిలే ఇంకేమిటి? వర్షాలు బాగా పడ్డాయి ఈయేడు.

వెం—సిత్తం అండి. మిమ్మల్నో యిషయం అడుగుదామని పిలిచే నండి.

ఉ—అదేమి టోయి?

వెం—మీాకు ఏ రేయింటికాడ సంగీతం నేర్పడానికి యీాలుంటా దండీ?

ఉ—నీకేనా యేమిటి?

వెం—కాదండి. ఈయన మా అయ్యంకుడండి. జోగి నాయన కూతురికే ఇచ్చేమండి.

ఉ—జోగికి ఇలాంటి వేషాలు పనికిరావే.

వెం—కాద్దా సర్కారువాత పిల్లకండి సంగీతం ఇంటికాడ నేర్చుకోవాలంట; పెద్ద కల్లాసుల్లో కొచ్చిందంట.

ఉ—ఎన్నేళ్ళుంటాయి?

రా—పదమూడో ఏడు మొన్న నే తొలకరి కెళ్ళిందండి.

ఉ—దివ్యంగా ఉంది. తగిన ఈడు. నాయుడు పే రేమిటి?

వెం—రాగినాయుడండి.

ఉ—ఈ నాయుడు పేరేనా? ఏ విషయములోనోగాని మానాన్న పదిమాట్లు చెబుతూ ఒచ్చేడు.

రా—గంజాం దొరిపాలం ఇసయమా యేటండి?

ఉ—ఆ! ఆ! అలాగె. మామా! నువ్వూ, నేను ఒకటే. వెంకు నాయుడు నా కయ్యావరస. నే కొత్తవాణ్ణి కాను. తప్పకుండా నీ కూతురికి అఖండంగా సంగీతం వచ్చేపూచి నాది.

ఆ క్ష్నల్లల్లో బెంగుళూరి నాగరత్నాన్ని మించిపోయేలా గెలాగు తయారవుతుందో నువ్వే చూద్దువు గాని.

రా—సిత్త్రం అండి. ఆ క్రినీపెట్టి మొన్న నే తెప్పించానండి నలబై అయిందండి.

ఉ—దివ్యంగావుంది. ఎప్పుడు మొదలుపెట్టడం? రేపు మా బాగుంది. నవమీ సోమవారం. వెంకునాయుడూ. మరేమిటి సంగతులు?

వెం—మరేటున్నాయి?

ఉ—నేను. ... ... ...

వెం—నే నీ యేకవగట్ల యెల్లి మళ్ళీ యెల్లుండి కొద్దారని సూస్తున్నాను. ఏటయినా కబుర్లున్నాయా యేటిసెప్పడానికి.

ఉ—కబుర్లేం ఉన్నాయి! చూశావా నా ఒళ్ళు; ఎలాగ చిక్కి పోయానో. దీనమ్మ కషు మ్మాడిన చదువు. నిద్రాహారా ల్లేకుండా కష్టపడి చదువుతునానని చెప్పు. నాకు పనుంది, వెళ్తాను. మామా, సాయంత్రంరోజు ఆరు గంటలకి వస్తాం టాను రేపన్నుంచి. పిల్లను రేపటికి సిద్ధంగా ఉండమను.

రా—సిత్తం అండి. దండాలు పంతులు గోరు.

వెం—సిత్త్రం. (ఉమాకాంతం నిష్క్రమించును.)

రా—పంతులు మంచోడ్నా గున్నాడు. మరి జీతం యిసయం మాటాడ్నేదు.

వెం—పనికానీండి. బాపనోడంటే యీమూల యింగ్లీసు సదువుకోని పెద్దోడయినాడుగాని, మల్లీమన అగ్గురోరింలోనికొస్తే మనం ఎలాగ సెప్తే అలాగె. మువ్వాల సడేటి? బల్లొచ్చాయి గావాల. పందడి పెరట్లోకి.

(నిష్క్రమించును)

---

రంగము ౩.

---

[నరసింహం ఇంటిగుమ్మం]

ఉమా—నరసింహం! నరసింహం. ఒరే,

కాముడు—(లోపలనుండి తలుపు తీయుచు). లేడు; ఎవళ్లో బరిపిల్లలింటికి వెళతానని వెళ్లేడు.

ఉమా—ఎప్పుడొస్తా డయితే? (తనలో) అన్నా! ఎవరే పిల్ల?

కా—(తలుపు మూయుచు) బాగా రాత్రయితేగాని రాడుగాబోలు.

ఉమా—ఇదేమిటి? కొత్త అవకాశం! పిల్లమాగుమ్మా విద్యుల్లతావిగ్రహాన్ శతపత్రేక్షణ చంచరీకచికురర్ చంద్రాస్య చక్రస్తనిన్ అన్నట్లుగా ఉందే. యెవడు భుజింప విరించి లిఖించెనో! అందగరాని యందము, నవారుణ యావనరత్నమా!

(తెర దిగును.

రంగము ౪.

---

[శాస్త్రిగృహము—గది]

[శంకరశాస్త్రి, నరసింహం, రంగాచారి.]

శం—ఏం రంగా అప్పుడే హడలేసి చదువుతూన్నట్టుంది. నీదుంపా తెగా! గట్టిగా చదవబోక. అజీర్తిసంకటం పట్టుకొంటుంది. చూడట్టా. ఎవరో తలుపుతట్టుతూన్నట్టుంది. (నరసింహాం నిష్క్ర-)

రం—ఏమిటబ్బా మీకంటె చదువకుండా వచ్చేస్తుంది. మరి మావంటివాళ్ళకు గట్టిగ పట్టు పట్టాలి.

శం—ఊహూ, insinuation కూడా నేర్చుకున్నావయితేర.

[నరసింహం ప్రవే].

నర—హాహా. Telegram. Sankarasastri son Congratulations. నా Congratulations కూడా్రనా అబ్బీ?

రం—ఎవరిచ్చారబ్బా?

న—శ్రీనివాసం.

రం—దస్తూరీ చూడగానే అట్లా అనుకుండుంటిని.

శం—ప్రెసిడెన్సీ ఫస్టుకి ఏం అప్లికేషను పెట్టి వేసిన్నట్టా? తెలి గ్రాందస్తూరీ....

రం—ఎందుకబ్బా?

శం—ఏదీ మొహం

రం—దీనికేంగాని సాయంత్రం అలెగ్జాండ్రాలో బాలుశాస్త్రి.

నర—ఉమాకాంతం రాని; పెట్టుబడి ఎంతో మాట్లాడుదాం.

శం—నలుగురికి పంచేసేదానికి వేరే మాట్టాట్టం ఎందుకు.

నర—కబుర్లు కట్టిపెట్టు, పేపరింకా రాలేదేం. పోస్టు వాళ్ళీ జన్మంలోమరి బాగుపడరుకాబోలు. ఎప్పుడొచ్చిన మెయిలు!

శం—Times ఏమంటాడో? మద్రాసుకూడా కలిపే మంటున్నారు కమిటీవాళ్ళు.

నర—Times మాటకేం గాని The Hindu వాడు మాడిపోతాడు అబ్బీ.

శం—మరికొందరు Bigwigs కూడాను. ఏం ఆచారీ! Ceded Barbarians ఏమంటారు? Honourable గుండాల.

రం—లేదబ్బా. మే మందరము మొన్న మా C. D. Conference లో for గా resolution pass చేసియుండాము.

(postman టపా యిచ్చి పోవును)

నర—ఇలాగ పేప రందుకో.

శం—లీడ రేమిటి.

నర—ఇది వినవోయి. Brilliant researches by the Andhra students of the University in Psychology and Physical Geography. Revolutionising all accepted theories "Times" admitration. ఇంకా చూడు Dr. SuryaRao's exposition of Dhanvantri before the Royal Society. ఒరే our fellows are drowning houses.

శం—చూడు తోరలో they will drown palaces ......
మ రరవాళ్ళని కబుర్లు కట్టిపెట్టు మ నబ్బాయి.
నర—ఇంగ్లీసూ అంతే?
శం—ఆంధ్రపత్రిక ఇట్టా పడేయి ...... (చదువును) ......
"ఆంధ్ర తందానపదములచరిత్ర వెంకట విద్యాభూషణ"...
లీడ ర్వినవోయి "ఆంధ్రభారతశక్తి స్వరూపము లత్యద్భుతములు. ఆ మహాదేవి ఆంధ్రహృదయకమల వాసిని. ఆంధ్ర మనోభావ విహారిణి"......

"అఖిల భారతీయ నల్లిమహాసభ... చెన్నపట్నములో సమావేశము... కార్యవిధానము... ప్రార్థన జాతీయ గీతము రాత్రి తొమ్మిది గంటలకు".........

"అష్టమాంధ్ర కన్యకా మహామండలీ సమ్మేళనము"...

"అఖిల భారతీయ హాంకర్చీ-పరీ సమ్మేళనము... గవర్నరుగారు తెరచుట"... "పిమ్మట ముగించు సమయమున హి, ఏ. ది గవర్నరుగారు కరతాళ ధ్వానముల మధ్యనుండి ఉద్భవించెనా యనునట్లు లేచి పూర్ణ బాధ్యాయుత రాజ్యయంత్రము విద్యుచ్ఛక్తి యంత్రము వేగమున......"
నర—ఏమిట్రా భాష?
శం—క్రొత్తప్లు డెట్టా ఉట్టుందిరా, నువు రాయబోతే అట్టాగే ఒస్తుంది... మన వేజైపుల డెప్యుటేషన్ మెంబర్లు సంగతేం కావాలా ఏమిటి?

[ఉమాకాంతం ప్రవేశించును]

నర—ఏమిరో మాలవె... ఏం జోకు జేస్తూన్నా వెవడు సంతోషించను?

శం—రత్న...మాల వె--వా అని మాత్రం వాణ్ణి తిట్టబోక; కావాలంటే నన్నుతిట్టు.

ఉ—గ్రహించేం వోయి. ప్రేలాపన మరి చాలించు.

శం—Boundaries fix చేసీశేరట విన్నావా.

ఉ—పంతులుగారికి తెలియందే paper లో యేసంగతి పడదని ఇందువలన తెలిసికోందువు గాక.

నర—మొట్టమొదట ఈ Telegram చూచి మరి మాట్లాడు.

ఉ—The where.

న—ఇదిగో.

ఉ—(చూచుకొని) My most sincere congratulations నీకూ నీ wife కిని నరసింహా Alexandra కి శాస్త్రి పేర్న wireless చేయి.

శం—తనది...కాకపోతేన్న తాటిపట్టె కెదురుగా డేకమన్నాట్ట నీయట్టాంటివాడే.

ఉ—No fear అబ్బీ ఈరోజు మామంచిదినంరా ఒకటి. శంకర కుమారసంభవం, రెండు, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం. అంచేత మనం ఈపుణ్య దినాన్ని celebrate చెయ్యాలి ఏలాగో ఆలోచించండి.

రం—కాలేజీ మానేద్దాం అబ్బా రేపు?

ఉ—Well said my single speech Hamilton. నీవు Dr. Sir. S. Subramania Iyer అంతవాడివి సుమా... తర్వాత నరసింహం ఇంట్లో వీలుగా ఉంటుంది.

న—నే నూరికి పోవాలో ఏమిటో గ్రా రేపు.

శం—అదేం?

న—మా నాన్న తద్దినం ఎల్లుండి. మా అన్నయ్యరమ్మని వైరిచ్చాడు. మంచి అవస్థలో పడ్డాను.

ఉ—దీనికేనా? అవస్థ అవస్థ అంటే ఏ Hamlet పడ్డ అవస్థలోనో పడ్డా వనుకున్నాం. నే బైరాగి చిటికి ఒహాటి ప్రయోగిస్తా. మరి మాటాడకు.

Item 1. Photo by Ramiah పోద్దున్నే. Item 2. వీడింట్లో విందు, ofcourse at Sastri's expense. Item 3. పగలంతా నాచిపార్టీ.

శం—నే నాంటినాచ్. అయినా రత్నమాలయితే రేపటికి ఒపిని యను మారుస్తా.

ఉ—మాటల్లో అడ్డకు.

Item 3. పగలంత నాచిపార్టీ.

రం—Impracticable schemes కిమన వాళ్లు ఇందుకేన బ్బా పేరు పడ్డారు.

ఉ—Nonsense. Pericles అంత Statesman మీాముం దుంటే ఏ Scheme అయినా Impractible అవుతుందీ? Item 4 రాత్రిభజన; రాజుని పిలుస్తా ఫిడేల్కి.

శం—That's good. Vocal రత్నమాల.

ఉ—ఛెప్పూరోఁకిసి... Item 5. అన్నిబొమల్లోను అన్ని పత్రికల్లో ఇదంతా వేసీడంన్నూ.

శం—పద్యాల్లోగూడా

రం—ఉమాకాంతం రాసినవి. ఉన్న కవుల్లో ఉమాకాంతం ఏకదా.

ఉ—ఉన్నవాళ్ల ఊసెందుకు? రాబోయి కవులందరికి కవి రంగాచారి ఉంటే.

శం—పోయిన పోతన్నకీ మీారిద్దరు సమంపగా బట్టి ఇద్దరు చెరో సగం రాయండి.

రం—సమ్మతే.

నర—కంకర్.

రం—సరే. బాగాఉండాది. పోదముఒస్తావా, నరసింహం? చీకటి పడుతుంది.

నర—వస్తున్నా. అయితే రేప్పొద్దున్న మిమ్మల్నిఎక్స్పెక్టు చేస్తూ ఉంటాను తప్పకండేం.

ఉ—రోయ్యప్రోగ్రాం అయినా మారుతుందిగాని ఉమాకాంతం పంతులి ప్రోగ్రాము మారుతుందోయి వెర్రివాడా! ......

తోవలో రామయ్యకి కబురు చెప్పు. (రంగ-నర-నిష్క్ర.)

అయితే శాస్త్రి నీకేం మతుందా లేదా? వాళ్ళిద్దరిముందరా రత్నమాల రత్నమాల అని ఊర్కే పేల్తావు. నే నంటే ఉపద్రం అయిన నమ్మకం మీాద మెలుగుతున్నారుగదా!

శం—అందుకా నరసింహం ఇంట్లో వేశావు రేపటిదంతా?

ఉ—అంటే... ఓరి... నేనేం అంత ఫూల్ననుకున్నావా? నా వాళ్ళు పైవాళ్ళుఅని నాకేం లేదనుకున్నావా?

శం—నీ సంగతి అంతా నాకు తెల్సుగా. రత్నాన్ని పెళ్ళాడుతా వేమిటి? రిఫార్ము, ఇకానవిూ అన్నీ గలుస్తాయి.

ఉ—ఒరే. ఎన్నన్నానరే చెబ్తావిను. ఇది ఫ్యూర్లవ్వే ట్ఫస్టు స్టైట్రా; నన్ను మొట్టమొదట చూశేనరి? దాని వేషాలన్ని కట్టిపెట్టేశింది. వృత్తి మానుకుంది. డబ్బక్కర్లేదు. కావా లిస్తే మనకే ఇస్తుంది.

శం—నీ దుంపా తెగా. నన్నుగూడా కలపకు మరి.

ఉ—దానికి సానిబతుకంటే ఆజన్మం ఉన్నా అసహ్యం ఏన్రా. నాతో సంసారం చేస్తానని చేతిలో చెయ్యేసింది. అలాంటిది మళ్ళీ సంభవిస్తుందిరా?

శం—అందరు పట్టిన బాకాయేగా?

ఉ—నో నో నో. దాని కెన్నేళ్ళున్నాయంటావు? మొన్ననే కదూ......

శం—మొన్న నయితే, నిన్నటి సంగతో?

ఉ—అదంతా తరువాత మాట్లాడుదాం.

శం—రక్షించేవు.

ఉ—మనస్సు పరిపరి విధాల పరిగెడుతూం దిప్పుడు.

శం—నరిసింహం ఇంటికేసి వెళ్తాం దేం?

ఉ—అస్యాం కేంగాని, ఆపిల్ల వాడి చెల్లె లేమిట్రా? తలుపు చాట్నుంచి వా ళ్ళేడని జవాబు చెబుతూంటే దాని ముఖం చూసి గుమ్మైపోయేను.

శం—అట్టా దోవలోకిరా. పూ ర్క్రీ-చ రది విడో రా. దాన్సంగతి ఒచ్చినప్పుడల్లా నరసింహం గుండె చెక్కలయ్యేటట్టు ఏడుస్తాడు. నువ్వుమాత్రం వెధవ్వేషాలేం వెయ్యబోకేం.

ఉ—వెధ వ్వేషా లేమిట్రా? డబ్బై ఏళ్ళు కావచ్చింది విడో మేరేజి ఏక్టుపేసయి. నరసింహం చూస్తే సివిలైజ్డుమాన్. ఆపిల్ల నలా అట్టి పెట్టేడం నా కేం అర్థం కాకుండా వుంది. రిఫార్మంటే జడుపేమిట్రా? ఎన్నాళ్ళీ హార్టు రెండింగ్ కండిషన్. పిల్లచూస్తే చిన్నది. చక్కన్ది. ఒంటిమీద సరుకు లయినా తీసేలే దింకాను. ఇంతో అంతో చదువుకుంది కాబోలు. ఏమోసుమా. నేనే అయితే......

శం—చెప్పూ. నువ్వే అయితే,

ఉ—ఏముంది? దివ్యంగా విడో మేరేజి చేసుకుంటాను సుమా.

శం—జపం విడిచి లొట్టల్లోకి దిగింది ... నువ్వుమాత్రం పిచ్చి పిచ్చి వేషా లేం వెయ్యబోక.

ఉ—బాగుంది... రేపు సక్సెసు అనిపించాలి... గుడ్నైటు.

(నిష్క్రమించును.)

శం—హేం కాలం, దీన్దుంపా తెగిం దేవడ్నీ నమ్మను. తల్లో వెంట్రుకట్టే నరసింహం వీడు ; ఇన్నాళ్ళాయింది కలిసి తిరుగుతున్నారు. వీడంటే వాడికి లక్షనమ్మకం. అట్టాంటప్పుడు వీడిట్టా ఆలోచిస్తున్నాడే. వీడి బ్రాహ్మోయిజం తగలడ్డట్టే ఉంది. వెధవ పన్లు చేయటం ఉన్నూ, ఏమిరాఅంటే తత్త్వంన్నూ, రిఫార్మున్నూ... [తెరదిగును]

# నవజీవనము.

## అంకము రెండు.

### రంగము ౧.

[రామినాయుడు గృహం.]

[ప్రవేశము - రామకుమారి]

రా.కు.—మేష్టరుగారు వచ్చేవేళయినట్టుంది. నాకర్థం నే నెంత చక్కగాపాడినా మేరీ ప్రైజు గోశిమ కిచ్చేశారు. కానీ వచ్చే మారు నాకు రాకపోతుందా? మామిస్సమ్మగారుకూడా నీకే రావలసింది, మధ్య నన్యాయం జరిగిందని చెప్పేరుకదా.

(లోపలనుండి పిలుతురు)

అబ్బా వీళ్లకి మరేం పనిలేదు. (లోనికి వెళ్లును).

[ఉమాకాంతం ప్రవేశించును.]

ఉ—ఆహా రామకుమారీ, నిన్ను చూచినరోజునుండి రత్నమాల, అంతటి రత్నమాల ఎందుకనిపిస్తూంది. నీలాంటి మోహనాంగిని అగ్రజన్మం బ్రాహ్మణజన్మం ఎత్తించక శూద్రకులంలో ఈ రామినాయుడు ఇంట్లో పుట్టించిన ఆ బ్రహ్మని ఏంచే

సినా పాపంఉండీ... ఇరవై యోృశతాబ్దంలో సమయం వచ్చినతరువాత బ్రాహ్మ ణ్లేమిటి శూద్రులేమిటి? ఏలాగయినా ఉమాకాంతంపంతులు అంటే సంఘసంస్కారానికి మార్గదర్శిఅని అనిపించుకొని వీరేశలింగం పేరు చెరిపించి వేయాలి.

నాల్గురోజులయింది మొదలుపెట్టి ఒక్కనాడయినా ఆ రాముడు మమ్మల్నిదర్శి ఒదలడుగదా దెయ్యంలాగ. ఎలాగయినా సంగతి కొంచెం సొంతు చేస్తేనేకాని ఎందుకీ ఉద్యోగం? ఆ హార్మోనియ మలా గెదురుగాబెట్టుకొని వాయిస్తూ ఉంటే ఒళ్లు మరిచిపోయి, అప్పుడప్పు డంతా తప్పే చెబ్తూన్నా, అర్థం లేకుండా మాట్లాడినా, అక్కడ కనక సరిపోతూంది. నా భాగ్య మెట్లున్నదో.

[రామకుమారి ప్రవేశించును]

అమ్మాయీ! మీ అయ్య ఏడీ వేళ?

రా—మా నాన్న......

ఉ—ఏదీ తలెత్తి మాట్లాడు కొంచెం

రా—పనిమీద ఊరి కెళ్ళేడు. రేపటివరకు......

ఉ—రేపటివరకు రాడుకదా?

రా—బహాశా రాడు.

ఉ—ఏం పుణ్యం. అబ్బా దోమ ల్తినేస్తున్నాయి. ఆ దీపం కొం

చెం దూరంగా ఉంచు...కొంచెం తగ్గించు...మరికొంచెం దూరంగా... ఏది మొదలుపెట్టు......

(కొంత సేపు సంగీతమగును)

ఏ ద్దగ్గిరసా రా. ఇప్పుడు నీవయస్సెంత రామకుమారీ.

రా—నాకు తెలియదు. పద్నాలు గెళ్లుంటాయి గాబోలు.

ఉ—నా వేపు చూశి మాట్లాడు. మరయితే రామినాయుడు ఏం వివాహప్రయత్నములో ఉన్నాడా?

రా—అదంతా ఇప్పు డెందుకండీ?

ఉ—అహా, అలాగంటె ఎలాగ; నాకామాత్రం శిష్యురాలిసంగతి తెలియకూడదూ?

రా—ప్రయత్నాంకి ఏంలేదు. మా మేనమామకొడుకున్నారు.

ఉ—ఆ కుర్రాడిపే రేమిటి?......చెప్పవూ. ఓ మరచిపోయేను భర్తపేరనా. ఇంకా వివాహంకాలేదు, అవుతుందో లేదో. ఇప్పట్నుంచి ఏం భర్త; ఇలాంటి నిర్బంధాలు పెట్టుకోకుమా. నాలుగయిదురోజులయిందీ మొదలుబెట్టి, మరి మాట్లాళ్లేదు నువ్వుకాని.

రా—జీతం సంగతా. నాకేం తెలుసునండీ?

ఉ—అబ్బెబ్బె. జీతాంకి నాకు పట్టుదల ఏమిటి? ఆసంగతి నిన్నెందుకడుగుతాను? నిన్నడగ వలసిన దదా?

రా—నన్నంత మీా రడగడాని కేముంది?

ఉ—ఏమీా, ళ్లేనే లేదా? ఏం చమత్కారం! అడగవలసిన దేదో వెంటనే అడిగీమనా నీ యర్థం?

రా—నే మీా అంత చదువుకున్నాను కనకనా అర్థాల్తో మాట్లాడ్డానికి.

ఉ—నా అంత చదువెందుకు? వృథాప్రయాసం, ధనవ్యయం ఉన్నా; ఒంటిమీాద కీడొచ్చీగానే ఒచ్చిం దాచదువంతా నీకు ముఖం చూస్తే తెలియదు. ఒట్టిచదువు లెందుకు, నీతో కూర్చోవడం నీతో సంభాషించడం...

రా—మీావంటి విద్యావంతులుతో మాట్లాడితే బాగుంటుంది గాని నాలాంటి...

ఉ—నీలాంటి పిల్లలతో మాట్లాడ్డమే ఓ విద్య. పుస్తకాల్లో ఎక్కడుందా విద్య. నువ్వు నీ తీపైన మాటల్తో నేర్పాలి ఆ సారుస్యం.

రా—నేనంత మాటకారినా? నాకు తెలియనే లే దిన్నాళ్ళూ

ఉ—ముగ్ధవు గనుక అలాగంటావు. అంతమాటకారినా ఏమిటి? మాటాడితే ముద్దు లొలుకుతా యంటూంటేను.

రా—మన మీాలాగ మాట్లాడుకోవడం ఎవ్వరైనా వింటే తంటావస్తుం దేమో.

ఉ—నీకు తంటావస్తే నాక్కాదూ? ఇక్క డెవరుంటారు? రామకుమారీ! నీపేరు పలకడం నా నాలుకకు అదృష్టం. ఆ పేరు

వినడం నా చెవులకు అదృష్టం ఉన్నూ. అయితే వివాహం అయినట్టే — నీ మనసుకి.

రా—ఎప్పుడో అయేదాని కీ చర్చఅంతా ఎందుకండి.

ఉ—అబ్బబ్బే. చర్చ కేముంది. నువ్వంటే నా కిష్టం కాబట్టి నీ భవిష్య త్తొ్కించెం అడిగేను. ఇంతకూ ఈడొచ్చిన పిల్లవి. నీ అంతట నువ్వాలోచించుకో వలసిన విషయం కదా. నీ ముందుసుఖాంకి ఎలాగైతే మంచిదో అలాగ ఆలోచించుకో. నాకు చేతనైన సలహా నే నిస్తాను. ఇంతో అంతో లోకానుభవం నాకూ వుంది. నామాట పాటింప వచ్చునులే.

రా—ఎంతమాట. ఏదైనా నా మేలుకోసమే కదా మీరు చెబతారు.

ఉ—అందుకు సందేహం ఏమిటి— ప్రేమకు, మోహాన్కి, వలపుకి వీటికి పరస్పరభేధం ఏమిటో చెప్పగలవూ... ఏం చెప్ప లేవూ?

రా—మా నాన్న గొంతుక వినబడ్డట్టయింది.

ఉ—హా ర్మనీ వాయించు. (రామ. అట్లు చేయును.)

[అంత రామినాయుడు ప్రవేశించును.]

ఇంకా ఆరోహణ సరిగ్గా పట్టుబళ్ళేదు. (పైకిచూసి) ఇదిగో మామ. ఊరికి వెళ్ళేవంది మీా అమ్మాయి. వెళ్ళే వచ్చే వేమిటి?

రామి—నేదు. ఏకువగట్ల ఎల్తాను. మరి మా పిల్ల కేటయినా ఒచ్చినట్టా?

ఉ—ఏటయిన ఒచ్చినట్టా అని అడుగుతా వేమిటి. పిల్లనుచూస్తే తెలియదటా. ప్రతిరోజు తప్పకుండా నువ్వూ వింటున్నావే. సర్వ సాధారణంగా చంటి పిల్లలింత చురుగ్గా నేర్చుకోవడం సాధించడం నే నిదివర కిందరికి చెప్పేన్గాని ఎక్కడా చూడ లేదు. ఏదీ రామకుమారీ నే వాయిస్తా న్నువ్వు పాడు "తొలి నేజేసిన పూజా ఫలము" మీ అయ్య వింటాడు.

(పాట అయిన తరువాత)

రామి—పంతులుగారి కేలయినట్టుంది బోజనాంకి.

ఉ—ఇక్కడ బోజనం చేయమంటా వేమిటి?

రామి—అబ్బో బామర్లు మాయింటికాడ మీరు బోజనం చేస్తారా?

ఉ—అభ్యంతరం లేదుకాని, మీరు మాంసభక్షకులు... సరే లే వెళ్తా నీవాళకి.

రామి—సిత్తం దండం అండి. దండంపెట్టే అమ్మీ గురువు గోరికి. (తెరదిగును.)

(నిష్క్రమించును.)

———

రంగము. ౨

---

[నరసింహం గృహం గది ఒకకుర్చీ; ఒకమంచము వాల్చి యుండును.]

[ఉమాకాంతం వీధిలోనుండి ప్రవేశించి]

ఉ—ఇంట్లో ఎవరూ కనిపించరేం? ఇదే కాబోలు అదృష్టం అంటేను. వీడు కాసీ అప్పుడే వచ్చేస్తాడో ఏమిటో. చూద్దాం; ఒక నిముషమైతే మాత్రం జాలదూ. నరసింహం.... నరసింహం.

[కాముడు ప్రవేశించును]

కా—మా అన్నయ్య లేడు. వీధులో కెళ్లేడు, వచ్చీవేళయింది.

ఉ—మీ అమ్మతో కానే ఊరికెళ్లే డేమిటి?

కా—లేదు మాఅమ్మ ఒక్కర్తే వెళ్ళింది.

ఉ—మరయితే వీ డెక్కడికి పోయేడు చెప్మా. ఒహో మగ్గాలూర్నాడ్నాన్కి గంధీ వచ్చేడు. అక్కడికి పోయేడు కాబోలు...... .........అమ్మాయీ నీపేరేమిటి?

కా—కాముడు. (ఉమా- కుర్చీమీద కూర్చొండును).

ఉ—కాముడేమిటి? కమల అని కాబోలు నీనామకరణం. నేను మీ అన్నయ్యకు కాల్లోనీళ్ళంటివాడను, మేమిద్దరం నాలు గేళ్ళయింది ఏమిరా బావాఅంటే ఏమిరా బావా అని

ఆస్యాలాడుకుంటూ అతిచనువుగా ఉంటున్నాం. అంచేతనే కొత్తవాణ్ణికాను. నాతో మాట్లాడ్డాన్కి మొహమాటం పడకు............మీ తండ్రి పోయి నాలుగేళ్ళయింది కాబోలు.

కా—ఆ. ఇంకా నా కళ్ళముందు కట్టినట్టే ఉన్నాడు. ఇదంతా నే పూర్వం చేసికున్న పాపం.

ఉ—విచారించకు. ఏంలాభం? ఇంతకు మీఅన్నయ్యే నీకు తండ్రి లాగున్నాడుగదా. నీసంగతి చాలామార్లు నాతో చెప్పేడు. నిన్నొచ్చి ఓమారుసావకాశంగా చూద్దామని శానాళ్ళాయి అనుకొంటూ వచ్చేగాని అనుకున్నప్పుడల్లా ఏదోపని సంభ వించడంవల్ల ఎప్పుడు ఇంతవరకు ముఖ స్తపడ్డం తటస్థించ లేదు. ఎదురుపడకపోయినా నీకు తెలియదు గాని నీగురించే ఎప్పుడూ నే నాలోచిస్తూ ఉంటాను. ఇంతకూ కాలం మంచి దికాదుగదా. నే తరుచుగా ఇక్కడికి కొస్తూంటే చూశావా లోకమో కాకులూ అన్నారు పెద్దలు.

కా—బాగుంది. ఎవరిళ్లకి వాళ్ళు రావడమే తప్పా? మీరు కాబట్టి వచ్చేరుగాని, పైవాళ్ళొస్తారా? ఒస్తే నేనెదురపడి మాట్లాడుతానా?

ఉ—అలాగన్చెప్పే ఒచ్చే నీవాళ...నువ్వు కొంతవరకు చదువు కున్నావుగదూ.

కా—ఏదో పల్లెటూరిచదువు. సీత సమర్త, ముసలాయకం ఏవో ఇలాంటివే. మాఅన్నయ్యకూడా ఇవి చాలా మంచివని కొత్త పుస్తకాలు కొన్నాడు మొన్ననే.

ఉ—అలాగా. మరేం మంచి పుస్తకాలు కొనలేదా? ఎన్నాళ్ళు చదివినవే చదవడం! నే నీమాఁ రొచ్చినప్పుడు మంచి ప్రబంధం ఉంది............

కా—ఏమిటది!

ఉ—దాని పేఋ......తారాశశాంకవిజయం, ఇవి, ఇంక వితంతు వివాహం మీాద వ్యాసాలు ఉన్నాయి తెస్తా. నీకు అవిసరిగా బోధపడకపోతే నేదగ్గిరుండి బోధపరుస్తా. విన్నావా ఆడవాళ్ళంటే ఒక్క వంటచాకిరికే పుట్టలేదుగదా. మీాకు చదువుకోవాలని, ప్రపంచంఅంటే ఏమిటో తెలుసుకోవాలని ఉంటుందిగదా.

కా—మా అన్నయ్యతో ఈమారు చెబ్తా నే నేదడిగి నా తెచ్చి పడేస్తాడు.

ఉ—ఒద్దొద్దు; వాడితో చెప్పకు. వెర్రినాగమ్మ తెస్తాడు, తేకపోతాడు. వాడితో చెప్పవద్దు. నే తెచ్చిపెడ్తాను...అబ్బ ఏం దాహం వేస్తూంది.

కా—మంచినీళ్లు తెస్తా (నిష్క్ర–)

ఉ—ఏవల్లకాడు. రామరామ, ఆ పెద్దమ్మ దీని అజ్ఞానాంకి

కారణ భూతుడు (కాముడు నీళ్లు తెచ్చిపెట్టును) చేతి కిలాగం దిద్దూ. ఒంగో లేను; తప్పు లేదు (తాగి) మంచినీళ్లతో తీరు తుందా ఈదాహం.

కా—మజ్జిగ తేటుంది తెమ్మన్నారా?

ఉ—(త) వెఱ్ఱిగుంట వైతివే (ప్ర) ఎందు కెందుకు మరేం శ్రమ పడకు. నిల్చునే ఉన్నావు. కూర్చో తప్పు లేదు, కాకపోయినా ఈ మన్ననల్నీ నలుగురిలో ఉన్నప్పుడుగాని మనంవేరే ఉన్నపుడు కూడానా? నే కూర్చోవడం, నీవు నించోడం ఏం బాగు లేదు నా మనసుకి.

కా—పెద్దలుగదా. మా నాన్న ఉన్నపుడైనా ప్రత్యేకంగా చెప్తేనేగాని ఎప్పుడు నించోవడమే మామ్మోలు.

ఉ—మంచి మామూలే. ఆడవాళ్లు మనుష్యులు కారుకాబోలు. కూర్చో. ఆహాహా కిందనొద్దు వెర్రికక్కుర్తి వీడు ఓ కుర్చీ. అయినా క్రొని పడేశాడుకాదేం. ఈ మంచంమీద కూర్చో.

కా—పర్వాలేదండి. మా అన్నయ్య ఉంటే క్రిందను కూర్చోడం కాదుగదా ఎదురుగుండా నించోవడమయిన అలవాటు లేదు.

ఉ—అడ్డగాడిదలాగున్నాడు. ఆడపిల్లల్ని నించోపెట్టడ వేమి లేకుంటే; నీకు బాధకలిగిస్తూ నే నెందుకు ఇక్కడ? పోతా నయితే.

కా—ఆహా - మామీా ద్దయుంచి మీా రొస్తే వెళ్ళిపోయేలాగ

చేస్తానా మా అన్నాయ్యకు తెలిస్తే చివాట్లుపెట్టడూ? మా అన్నాయ్య వచ్చేవరకు కూర్చొండి. పోనీ మంచంమీదే కూర్చుంటాను.

ఉ—అలాగ - ఈ వాళ ఇక్కడికి రావడాన్ని ప్రాణం చేరొచ్చింది. నేనున్న ఇంట్లో ఎవరూ లేరు. అయిన ఆడది లేని ఇల్లు ఇల్లేమిటి? అంచేతే ఆడదాన్ని గృహలక్ష్మి అంటారు. మనవాళ్లు మళ్ళీ అదేమిటో అలాగంటూనే ఇంటి క్కళ తెచ్చే ఆడపిల్లని ఇది వితంతువ బొట్టు పెట్టుకోకూడదంటారు. కళుండకూడదంటారు. నీ శుభ్రమైన మొహాముచూస్తే...

కా—ఏం చేస్తా నన్నయ్యా—

ఉ—పోనిద్దూ అన్నయా ఏమిటి? నా పేరు పెట్టే పిలుద్దూ.

కా—నే నోచుకొన్న దింతేను ఈ జన్మాంకి.

ఉ—అదేమన్నమాట. చూస్తే సుఖపడవలసిన కాలం అంతా ఇంకా ముందే ఉన్ది బోలెడంత. అన్నాళ్లూ ఇలా తలకు నూనె రాసుకోకుండా, అందమైన చీరకట్టుకోకుండా, ఆ తదియచంద్రుళ్ళాంటినెన్నొదుట్ని చుక్కబొట్టుపెట్టుకోకుండా ఏ కాకిలాగ ఒంటిగ బతికినన్నాళ్లు ఉండవలసిన దేనా? అది కాదుసుమా నా ఊహ.

కా—కాకపోతే నన్నయ్యా?

ఉ—మళ్ల అన్నయ్యంటావు? ఆ మాట మానీద్దు బతిమాలుకుంటాను.

కా—కాకపోతే, ఏదో ఇప్పుడా బలుసు వెంకమ్మలాగ మొగుడు చచ్చి రామేశ్రం వెళ్లొచ్చీ, మళ్ళీ పెళ్లాడల్ని మొన్న గోవిందమ్మకూడ మీాటింగు చేసిందట ఆంధ్రపత్రికలో ఉంది అలాచేస్తే నలుగురూ మొహంమీాద నిప్పువేసి కాల్చరూ.

ఉ—ఏదో ఎవరో చేస్తారనా నీ భయం?

కా—నా మాట కాదండి, నాకేం వెఱ్ఱా పిచ్చా అలాంటి ఊహాకి, భయాంకి? లోకంమాట చెబ్తున్నాను.

ఉ—అలాంటిఊహా పెట్టుకోవడం వెఱ్ఱంటావా? ఏంమతం? తోటి వాళ్లందరూ హాయిగా పుట్టినందుకు సార్థకంగా ప్రాణాంకి ప్రాణంలాగుండి భర్తలతో కాపరం చేస్తూంటే ఎదో విధి వశంచేత ఏ బ్రహ్మగాడి బుద్ధి తక్కువచేతనో . చిన్నతనంలో కన్నులు విప్పనప్పుడు కట్టుకున్న మొగుడు గుటుక్కుమంటే ఇంకా పిల్లగతి అంతేనా? అదా నీ అభిప్రాయం? దానికి బతుకక్కర్లేదూ? దాని క్కాపరంలో తీపి పనికిరాదు? అది మనిషి కాదూ? దానికి మొగుడూకాపరం అని ఆశ ఉండదూ? అందులోఇంతో అంతో చదువుకొనినీలాగ చక్కగా ఉందంటే అలాగుండి పోవడం కర్మమా దానికి? నీ యందం నీయవ్వనం నువ్వూ కృశించిపోవడమేనా? అదా నీ ఊహా? ఏంచెప్పేవు? ఇంతకూ ఇదివరకు కట్టుకున్న వాడితో ఏమనుభవించేవని? మొగుడుచస్తే మళ్ళీ పెళ్లాడకూడదూ? ఏశాస్త్రా

ఏ దేవుడు రాసిబెట్టేడు? ఈ అనాచారం మన్లోనే ఉందిగాని మరెవ్వర్లోనయినా ఉందా? ఏం మాట్లాడవు? నే చెప్పిన్ది నిజమేనా? పెళ్లాం చస్తే మొగుడు పెళ్ళాళ్ళేదూ? అదేనా పాపం చేసుకుపుట్టింది? ఇలాగ నావేపు చూడు. నేనన్నది అవునంటావా కాదంటావా?

కా—ఏమిటో సంసార్లం కదా! పెద్దలు పెట్టిన మనాచారాలు మన కున్నాయి.

ఉ—మళ్లీ పెద్దలే అంటావు! వాళ్లు చెప్పిందల్లా శిలాక్షరాలా? వాళ్ళేం దేవుళ్లా? ఏదో మాటసందర్భం వస్తే చెప్పేను. నీ అంతట నువ్వే ఆలోచించుకో నే చెప్పిన్ది నిజమవునో కాదో. ఈ పువ్వు తోవలో వస్తూంటే ఒకరిచ్చారు. తల్లో పెట్టు. ఒక్కమారు చూచి సంతోషిస్తాను. (జేబులోనుంచి తమల పాకులు చెక్కలు తీసి) ఈ ఆకులు నువ్వు వేసికో. మిగిలినవి నే వేసుకుంటాను.

కా—(నవ్వి) నే వేసుకోకూడదు. తప్పు.

ఉ—ఇదెక్కడి పాండిత్యం. ఎన్నాళ్లాయి మానేశేవు. వెర్రోడక వేసికో. అదేమిటా పువ్వుకూడా ఆలాగే ఉంచిశేవు. పో న్నే పెడుదునా తల్లో?

కా—లేదు లేదు. తల్లో పువ్వులు పెట్టుకోకూడదు. తమల పాకులు వేసికోకూడదు.



ఉ—నువ్వేసుకోకపోతే నేనేనా వేసుకోవచ్చునుః నేను నీతో పాటేను.

కా—అదేమి టలాగంటారు. మొగాళ్ళు మీరు మహారాజులు. మీ కేమిటడ్డు?

ఉ—నాకడ్డు లేదంటూనే అడ్డు చెబుతున్నావు. ఎందుకు నీకు లేని సౌఖ్యం నాకు? సరస్వతీదేవి తాండవమాడేచోటు ఆనోరు తమలపాకులకే నోచుకోన లేదా? దానిమ్మగింజల్లాంటి ఆ పళ్ళకి ఎంత మంచిరంగొస్తుంది. పోనీ మరేం అనుకోకు. (వాచీ చూచుకొని) మరి నాకు ఉన్డడాన్కి వేళలేదు. సర సింహంతో కూడ, నేనచ్చేనని ఇలాగ కాలక్షేపం అయిందని ఏమిచెప్పకు. చెపితే మరేంలేదు కాని; అయినా చెప్పడం ఎందుకు? ఏంచెప్పనని ఏది ఆచెయ్యి ఇలాగ చేతిలోవెయ్యి. (అని కాముడు చేతి దగ్గరకు తన జేతిని జాచును.)

కా—(కాముడు వెనుకకు జరిగి) ఆహా! ఒద్దంటే ఎందుకు చెప్తాను. నేనేం మనిషినిగానూ?

ఉ—మరినన్ను వెళ్ళమన్నావా? (ఉమాకాంతం నించొనును)

కా—మాఅన్నయ్య వచ్చేదాక కూర్చోండి. మళ్ళ యెపుడిలాగ దయపుడుతుందో.

ఉ—ఎంతమాట నీదయకోసమని నే నిలాగ స్వాతివానకోసం

ఎదురు చూసినట్టు చూస్తున్నాను. రేపొస్తాను. వెళ్తాను. ఇదిగో వెళ్తాను. తలుపు చేరేశి తలుపు వేసి వెళ్తాను.

(అని నిష్క్రమించును.)

కా—మంచిది. మనిషి మా మంచివాళ్లాగున్నాడు. మా అన్నయ్యయినా ఇంత చనువుగా యెన్నడు మాట్లాళ్ళేదు. ఎంత తెలివయినవాడు! మాఅన్నయ్య వట్టి మొద్దుగదా. నేనంటే ఏందయ; ఏందయిగా మాట్లాడేడు. నన్ను గురించే ఎప్పుడూ ఆలోచిస్తాడట. పాపం నేనుంచుంటేనే ప్రాణం ఒప్పింది కాదు. వెఱివాడు నే వేసుకోనంటే తనుకూడ మానేశేడు తమలపాకులు. అన్నయా అని పిల్చే ఆడదే లేదట. ఆ అలవాటు చేతనే కాబోలు అన్నయ్యా అని పిలవొద్దన్నాడు. ఏమిటో లోకాభిరామాయణం అంతా మాట్లాడేడు. వెధవ ముండలికి మళ్ళీ పెళ్ళంటాడు. నే నిన్నాళ్ళు మొగుళ్లేకుండా ఉన్నానుకానూ. మొగుళ్ళేకపోతేబతుకేమిటంటాడు! వెఱివాళ్లాగున్నాడు. నా మొగుడు చిన్నతనములోనే చచ్చిపోయేరుగదా. నా కిప్పుడు బతుకేం కష్టంగా ఉందీ. మా నాన్న సంగతి అంటేనే వేరు. మా నాన్నపేరు తల్చుకుంటేనే కళ్లంట నీళ్లొస్తాయి. మా నాన్న లేనిలోటు ఎంతమంది అన్నయ్యలుంటే తీరుతుంది.

మా అన్నయ్యతో చెప్పొద్దన్నాడేం చెప్మా? ...అవునింతోటి మా భాగ్యం వాడితో చెప్పేదేమిటి? అయినా

మా అన్నయ్యా కీలాటి కబుర్లంటేనే తలనొప్పి ... పాపం మళ్ళీ వస్తానన్నాడు అంత దూరాన్నుంచి... జోడు చప్పు డవుతుంది. అన్నయ్యా వచ్చేడు కాబోలు.

(అని వీధిగుమ్మం. వేపు నిష్క్రమించును)

(తెర దిగును)

---

రంగము ౩.

---

రా మి నా యు డు గృ హ ం.

[రామకుమారి ఆంధ్ర పత్రిక చదువుచు ప్రవేశం. అట్లు కొంత సేపయినతరువాత రామినాయుడు ప్రవేశించి]

రామి—ఏటమ్మన్నా ఆపేపర్కి డబ్బు దండుగేనా ఏటయిన సదువ్తున్నావా.

రాకు—రోజు చదువుతున్నాను. నీ కీవాళ కొంచెం చదివి విని పిస్తాను. విను ఇదిగో 'ఆంధ్రవిజయం' దీన్ని గురించి చదివీదా?

రా—అంటే ఏటి.

రామ—మన తెలుగుదేశస్థులికి ఇప్పుడు వేరే రాష్ట్రం, వేరే గవర్నరు, వేరే హైకోర్టున్నూ...

రా—ఏకే హైకోర్టా! రచ్చించేరు. అయితే సెన్నపట్టం కెళ్ళక్క ర్నేదూ పెద్దదావాకి?

రాకు—అక్కర్లే దీమీద.

రా—రెయిళ్ల కెంతంతడబ్బు పోసీవోళ్లం ఇన్నాళ్లూ. సూడమ్మన్నా ఇంతా డబ్బు దండుగ బెట్టుకోని యెల్లితే మనమాటా? మన మనసులా? ఆల్ల మాట మనకి తెల్దు, మనమాట ఆల్లకి తెల్దు. పట్నం మాత్రం, వ్వా! అమ్మన్నా! ఈ కళ్లు సాలవు. ఏ టంటావు? రాత్రి అయ్యేసరికి తీగదీపాల్తో పట్టపవ్వాలు సేసేస్తారు. ఏ టక్కడి మోటారు, ఏ టక్కడి ట్రాములు! ఎంతదూరమయిన ఓ అణా నేకపోతే అణాపరిక్కి ఎల్లొచ్చును వాటిమీద. అమ్మా టేసను దిగ్గానే, తంబిడి పీసోళ్లు ఒచ్చి మనం పిలవకుండానే మనమూటల మోసేస్తారు. ఆ టేసను ఏటమ్మన్నా, ఇక్కడ్నుంచి ఆ బొమ్మర్ల ఇంటికాడ వర్కు ఉంటాది. అచ్చూస్తూ నే నుండిపోనాను. ఆ తమ్మిలిపీసు కూలోడు మూటపట్టుకోని ఎటుపోనాడో ఓ గంటనెక్క యెదికి తేగానిదోరికేడుకాదు. ఎంత ప్రజంటావు? ఎంకాపురం తీర్తంలాంటి తీర్తాల్ని రెండుకలపాలి. వాడు నన్ను అక్కడే ఓ టేల్కి తీసికెల్లి ముక్కాలిరూపాయి కుడు అన్నాడు. అంటే ఏటర్థం? సచ్చి గింజుకోని ఏలాగయితేం ముప్పావలా అని పక్కనున్నోళ్లు సెబ్తె తెల్సింది. కుడ్డం అంటే ఇవ్వడంట. యెదవబాసమ్మన్నా. ఏటి నాల్గడుగలు మోసేడు. ముచ్చవక కూలంట. ఏటి నే మోసుకోనేను? ఆ డోది ల్తేనా? కూలియ్యకపోతే జమాన్తో సెబ్తానన్నాడు. తరువాత నా దండగడి

యం, మెళ్లో పతకం గట్రాసూచి కొంత్తమె త్తబడి కాళ్లా వేళ్ల బ్రతిమాలుకున్నాడు. ఇదేటన్సని చెప్పి పారేశాను - అమ్మన్నా మన తిళ్లు, ఏంతిళ్లు? సాంబారంట అది పోసీసీడు కాలువలై పారాల.అంతా పావలాకే నమ్మన్నా.అరిటాకులో బోజనం, తరవాత అరుగులమీద పడక... కాని డబ్బు మా అయ్యాది. కచేరికెల్లడం... ఈమారు నీకు సూబిత్తాకదూ.

రా.కు.—తర్వాత...... అంతర్జాతీయ వివాహ సమస్య... ఇన్నాళ్లూ మన కీ బ్రాహ్మర్లకీ సంబంధాలు లేవా, ఇటుమీ దెందు కూ్సాడదు? జాతిభేదా లేమిటి? అందరు ఒక ర్నొకరు జాతి అడ్డులేకుండా పెళ్లా డొచ్చు నని కాశీభొట్ల ఉమా కాంతంగారి ఉపన్యాసం.

రా—ఏటి? నీ సంగీత మేష్టరేనా ఏటి?

రాకు—ఊఁ. ఊరి పెద్దలముం దుపన్యసించేరట.

రాము—పంతులు ఏంటంటాడో సదువు.

రాకు—"ఆంధ్ర మహాజనులారా! భారతీభక్తిపరాయణులారా! సకల విద్యాధురంధరులారా! తమవంటి మహాశయులతో గూడుకొన్న ఈ మహాపరిషదముముంగల సర్వ భారతీయ సమస్యయే కాక అంతర్దేశీయ సమస్య యగు అంతర్జాతీయ వివాహమహాసమస్యగూర్చి చర్చించి ఉపన్యసించుపుణ్యము నాకు లభించిన ఈ దినము కడు సుదినము"......తర్వాత ..."మ న్యాజ్ఞవల్క్య నారద గౌతమ బృహస్పతి పరాశ

రాది సనాతన స్మృతులయందుగాని వేదములయందుగాని ఉపనిషత్తులయందుగానిసదా రాత్రులందు తారామండలో సేత మైనిర్మలమై దీపించు ఆకసముక్రింద సమావేశమై పండితోత్త ములు పారయణ జేయునపుడు మీరు వినెడు భారత భాగ వతమహాపురా ణేతిహాసములయందుగాని ఇట్టి వైపరీత్యము, ఇట్టి భగవదాజ్ఞా విరుద్ధము, ఇట్టి హైన్యము, ఇట్టి జాత్యా భివృద్ధి నష్టదాయకము, ఇట్టిఅసందర్భము, ఇట్టి అజ్ఞా నము, ఇట్టి పామరత్వము వినియుంటిరా? లేదు; చదివి యుంటిరా? లేదు, లేదు. ముమ్మాటికిని లేదు"....తర్వాత "బ్రాహ్మణేతరచిన్న దానిని బ్రాహ్మణులు చూచుట లేదా? ఆసించుట లేదా? ఒండొరులమనసు లేకీభవించినను జాతి నిర్బంధమను రాక్షసియొక్క వాడిగోళ్ళ బడి నలుగురి నోటనుబడుచుండుటమనముచూచుచుండుట లేదా? నాయులు బ్రాహ్మణులకన్న తక్కువవారలా? పరమాత్ముడు తన చిద్వి లాసము చేత హిరణ్యగర్భ నిర్గతుండై లీలాక్రాంతమగుమా నవకోటిని సృష్టిజేసినపుడు, వీడు నాయుండు, వీడు బ్రాహ్మ ణుండు వీడు మరొకండు అని మన ముఖములపై లిఖించెనా? (కరతాళధ్వానము) వీరలు ఇష్టమయిన యెడల ఒండొరుల వివాహము చేసికొనగూడదని శాసించెనా? నేనును ఉప నిషత్తులను స్మృతులను ఇంతయో నంతయో పఠించియు న్నాడ. ఏతద్భావంబును గ్రహించియున్న వాడ. అందెందు

నిట్టి వైపరీత్యములు వ్రాయబడలేదని నొక్కి వక్కాణింప గలను. ఇంతేగాదు. అర్థము సరిగ జూచిన అంతర్జాతీయ వివాహము లుపచరణలోనికి తీసుకురావలెనని గూడ యందధికారముగలదు. దీని విషయమై ఏనొకచిన్నగ్రంథము ప్రచురించు చున్నాడ గాన ఆవిషయమిప్పుడు విపులముగ చర్చింపను.

నాయులకు గల తక్కువ యేమి? కష్టసుఖములు అందరివి ఒకటిగావా? నాయులపి ల్లలైన నేమి? నమ్మకమైన యవ్వనములోనుండి అందములరాసులయి మధుమృదుగాన కళాచాతుర్యలై దేవాంగనల కనంగశాస్త్రిము విప్పిచెప్ప శక్తినిపుణతగల నాయుల పిల్లలు లేరా? .వారిని జూచి బ్రాహ్మణు లెంతమందియో వీరైనచో వివాహ మాడుటకై ఉవ్విళ్లూరుచుండుట మనము చూడలేదా ... (హాసము)" ...తర్వాత..."ప్రకృతి గుణములకు విరుద్ధముగ నిర్బంధింపబడిన ఈ జాతి యను మహాఘోర......

రా—అమ్మనాన్నా! అయితే పంతు లొచ్చి సూద్రపోళ్ల పిల్లల్ని బాపనోరు పెళ్లాడితే తప్పునేదంటాడా?

రా. కు—అలాగే. కాలము మారుతూంది కదూ నాన్నా.

రా—మన పెద్ద లొప్పుకోరే. బాపనో రెచ్చయినోరుగదా, కాపోళ్ల పిల్లల్ని పెళ్లాడుతారా? మన మంటే ఏమోగాని

... ఏటి? నిజమే. బాపనోళ్ళ ఎక్కువ ఏటి? ... మనకన్న ఎచ్చాసడబ్బం లేని. కనిష్టీబ్బనికూడా చేస్తున్నారు. మనకన్న ఎక్కువ బుఱ్ఱలు మారుస్తారు. ఒయిసుకి బాపనోళ్లేటి? సూద్రపోళ్లేటి?... మరి అమ్మన్నా! ఇయ్యా ఉంటాయి పేప ర్లో? నీ కలాసు పాటా లుండవూ?

రా—ప్రపంచకజ్ఞానంకోసం అని మా మిస్సమ్మగారుకూడ ఇలాం టివి చదవమని చెబ్తూంటారు. మొన్న మిస్సమ్మ మనింటి కొచ్చినప్పుడు ఈ సంగతే అమ్మతో చాలానేపు చెప్పింది. అమ్మ మాత్రం ఇది బ్రాహ్మర్లకి తప్పులేదు గాని, మనకి అలాగ పెళ్ళాడి బ్రాహ్మర్లని పాడుచేయడంవల్ల పాపం తప్ప దని అంది. మిస్సమ్మ అదంతా చేదస్తం అంది. అమ్మకు అలాగంటే కోపం వచ్చిన్ది. ఇదంతా బాగులేదని మిస్సమ్మ వెళిపోయింది.

రా.నా.—ఏటో ఈ గొడవంతా నాకూ నీకూ ఎందుకు? ఎంకా పురంనుండి గరిసె డిత్తనోలు మలిపంటకి తోలుకొచ్చేను. భూమాదేవి దయ్యుంటేను ఒచ్చీవేడు మనపని సూద్దు, ఎంత బాగుంటదో? బరి యేళ కానే దింకాను. పో, సల్ది తిను.

(రా. నిష్క్రి)

(తెరదిగును.)

## రంగము ౪.

---

[రత్నమాల గృహం—ముందు భాగము.]

(ఉమాకాంతం రాగవరస నేదో పాడుచు)

ఉ—కలియుగా న్నుద్ధరించడాన్కి పుట్టిన శ్రీకృష్ణుళ్ళా గున్నాగాని మొత్తంమీద అడియారువా ళ్ళ్యార్కే ఒస్తా డింకానని ఎదురుచూస్తున్నారు. హైద్దమ్మలు!అప్పుడే వచ్చేడు.ఉమాకాంతం అనే పేరుతో సంఘసంస్కరణం మొదలుపెట్టేడని వీళ్ళకి తెలియదుగదా.దీన్ని ఉపనిషత్తుల్లో అవిద్యఅనగా ఇగ్నొరెన్సుఅనిఅన్నారు.ఈవాళెంత క్రౌడెడ్‌ప్రోగ్రాము!పీస్కాన్ఫరెన్సులో ప్రెసిడెంటు విల్సనుకైనా ఇంతపని జోరుంటుందీ? ఉమాకాంతంగారి ప్రభ ఏం కాంతియుతంగా వెలుగుతూన్ది! ఓమూ ల్నింద్రు డసూయబాధ పడలేక సస్తున్నాడు; మరోమూల్న మన్మథుడు ఛెడ మాడిపోతున్నాడు. ఉమాకాంతం! ఎంతవాడవోయి? నామీద పద్యాలు నేనే చెప్పుకోవల్సి వస్తుంది కాబోలు. అం డ్దేరీజ్నోడౌ టైవి ల్బీ ఏ ఫి ట్హీరో ఫరె నెపి క్పోయెం.

ఒ! గుండె కొట్టుకుంటూంది. ఆ ఆ ఆ గాగు. తల్చుకున్నది తప్పుతుందా?

"జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై... ... "

(పద్యమును రాగవరుసలో చదువును.)

శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్యభామ లనేషువాంటివాళ్ల నిద్దర్ని భార్యలుగా జేసికున్నట్టె నే నీ రత్నాన్ని రామకుమార్ని వివాహంచేసికోవడమా? లేకపోతే రామకుమారిని వివాహం ఆడి ఆరత్నాన్ని అట్టే పెట్టుకోవడమా? అన్నా! మతిచిపో యేను. నాప్రియమైన కమలో? వీళ్ళిద్దర్ని తల తంతూందే. ఇందులో ఒహ షోకు. ఎవర్ని చేబట్టినా సోమ్మలిఫార్మే.

ముగ్గుర్ని వివాహం ఆడ్డం ఎలాగా కుదరదు. ఇద్దర్ని చేసుకుంటే ఇంక ఇంట్లో రోజు సవుతు ల్లగువు లెవడు తీరుస్తూ కూర్చుంటాడు? నా మీద ఎచ్చు యిష్టం అని ఒకర్తెఅంటే, నా కే పువ్వులదండ ప్రత్యేకంగా తెచ్చేరోఅని రెండోది. నా కీజపా న్విసనకర్ర ప్రత్యేకంగా తెచ్చేర్లేవోఅని జవాబుదానికి. ఇలాగ ఇక వాళ్ల కయ్యాలు. వాళ్ళిద్దరిమధ్యకి నే వెళ్ళడం. దీని వేపుచూస్తే దానికిదుఃఖం. దాని వేపు చూస్తే దీనికి దుఃఖం. ఎదురుగా నిల్చోబెట్టి ఇద్దరిమీదా చెరోకన్నూ బారేసి మాట్టాడాలి. మాటల్లో ఎచ్చుతగ్గు లొస్తే మరారాత్రి "శిరమచ్చో తొలగించె వామపదంబున" అనిముద్దుముద్దుగా వాడన్నాడుగాని, నాకుమాత్రం మొహం బద్దలగుతుంది. అప్పుడు రెండోఆవిడ నిక్కుతూ నీల్గుతూ వచ్చి నే చెప్తే విన్నారా అని ఆవిడగారిచేత దెప్పులు బుగ్గ పొడుపులు. అంచేత వీళ్ళకి వేరే వేరే మేడలు కట్టించాలి, అంటే ఎస్టాబ్లిషుమెంటు డబుల్చెయ్యాలి. అబ్బా ఇద్దరి

భార్యల్ని కట్టుకుని సుఖపడ్డ ముండావా డెవడు? భవిష్యత్తు ఆలోచించాలి. ఏం పాలుపోకుండా ఉంది. ఫర్ అండె గెన్స్టు ఆర్గ్యుమెంట్సు మెమోరాండ మొక్కటి తయారుజేస్తేకాని ఇష్యూలు క్లియర్గావు.........చూద్దాం......

(లోపలికి వెళ్ళును.)

అదిగో కాంతారత్నం, రత్నమాల, రత్నా

రత్న—(లోపలిగుమ్మమునుండి వచ్చి) ఒహ్హోహో! మీరేనా!

ఉ—నే కాకపోతే మ రెవ్వరు నీ దగ్గరికి... ఓహో మరిచి పోయేను. నీ కేం నీ కాళ్ళదగ్గరికి రాజాధిరాజులు రావ డాన్కి నిరీక్షించుకొని కూర్చొంటారు. నేనే ఉన్నానూ నీకు?

ర—తోవ తప్పినట్టుంది. నే జ్ఞాపకం ఉన్నానూ?

ఉ—ఉండకుండా ఎలాగ?

ర—ఎలాగనికూడానా అడగడం? కృతయుగంలో వస్తానని చేతి లో చెయ్యేసి మర్నేటివరకు పిక రేదుగదా. మీ మాట తేట లెక్కడి కెళ్లేయి. మీ రెక్కడి కెళ్లేరు. అయినా ఆడ దాన్ది బుద్ధితక్కువ. మగవాళ్ళ న్నమ్మమని ఎక్కడుంది? మీ రెం చేత ఇటే పడుగు పెట్టడం మానీశేరో తెలుసు గాని అయినా మీ నోటంట వింటాను. ఏదీ?

ఉ—తెలుసు నంటావే? మరి నే నెందుకు చెప్పడం?

ర—పంతులుగా రేం శలవిస్తారో విందామని.

ఉ—నే మాట్లాడితే నా స్వరసారస్యమా, మాట చమత్కారమా? బాగులేన్ది నే చెబితే బాగుపడుతున్దా. ఆ ముత్యాలమాటలు ఏదీ నువ్వేమొదలు బెట్టు.

ర—నే మొదలుబెట్టనె పెట్టాను. మీరే పూర్తిచెయ్యాలి.

ఉ—ఇలాగ పూర్తిచేస్తాను. (అని ముద్దులాడబోవును.)

ర—(తప్పించుకొని) చాల్బాలు దూరంగావుండి మరీ మాట్లాడండి.

ఉ—ఏం ఇంత వింతగా మాట్లాడుతున్నా వీవేళ?

ర—మీారు వింత పన్లు చేస్తూ ఉంటే నే వింతగా మాట్లాడగూడదో?

ఉ—ఏమిటో నీ మనోభావాలు బోధపడవు నాకు.

ర—నా మనోభావా లెలాగ బోధపడతా యిప్పుడు.?

ఉ—ఏదీ సిగరెట్టు కాల్చు. ఇది లేటెస్టిజష్షను.

ర—ఇది బాగుంది.

ఉ—అహా మిస్గాడిస్కూప రెలాగ కాలుస్తూందో చూడా కేలండర్లో. పోనీ, నేసారంగధరుడ్నట,నువ్వు చిత్రాంగివీ నట. నిజం అలాగయితే ఏంచేస్తావో చెయ్యి.

ర—అంత బతిమాలుకోవడాన్నే ఈ దశ పట్టింది నాకు.

ఉ—ఆ పేక ఇలా గందుకో. (పుచ్చుకొని పంచి ఆట మొదలు పెట్టుదురు)......ఇప్పుడు కొంచెం శాంతించిందా రాణీకి? రాణీ నాది.

ర—అయితే రాజుకు రాజు నాది.

ఉ—నువ్వు రాణీవి.

ర—సరే ఇన్నాళ్లూ ఎందుకు కనబడలేదో చెబుదురూ?

ఉ—ఏమీ లేదు; దీనికో పెద్దకారణం ఏమిటి మై లవ్? నీ దివ్యవిగ్రహం ఎప్పుడూ కళ్ల కట్టిన ట్టుంది. నన్నింత మట్టుకు పట్టించి అడగడానికి కారణం నువ్వు చెబుదూ.

ర—ఏ ముంది ముంజేతి కంకణం.

ఉ—అదేమన్న మాట. నీఅద్దంలో ఎలాగ ప్రతిఫలిస్తుందో అని.

ర—మీ చేత లన్నీ ప్రతిఫలిస్తూనే ఉన్నాయి. పంతులుగారికి సరిగ్గా తెలియదుగాని, నమ్మినవాళ్ల న్నమ్మకం ఉంచకుండా తమరు నన్ను కాదని మరొకరు, వారు కాదని ఇంకొకరు దగ్గిరికి వెళుతూంటే మీకూ నాకూ గల బాంధవ్యం శిథిలం అవుతుందా లేదా.

ఉ—ఆ గాగు హార్టు మీద డైమ న్డేసి తీస్తా వేమిటి పట్టు?

ర—నే చెప్పేది వినబడుతూందా.

ఉ—నీ కెన్నోకు లొచ్చాయి; ముక్క లెచ్చు నాది.

ర—నే నంటూన్న దేమిటి?

ఉ—ఈ మారు కలపడం నీది.

ర—మీరు కలియండే.

ఉ—మొన్న మనం తీయించుకున్న ఫోటో వచ్చిందా?

ర—తేలే దింకాను; తెస్తే తిరగ్గొట్టిస్తాను.

ఉ—అదేం? ప్రూఫులో నువ్వే బాగున్నావు నాకన్న.

ర—అందుకు సందేహం ఏమిటి?వ్యవహారం చూస్తే తెలియదు?

ఉ—మధ్య నాట మరిచిపోయేవు.

ర—నేనా? మీరా? ఆట సంపూర్తిగా ఆడమనే నా మనవి.

ఉ—తప్పకుండా.

ర—మాటలు గాలికి పోతా యనా?

ఉ—పంచు. పంచందే ఏమి టాడ్డం?

ర—మా టివ్వండి.

ఉ—నా మాటే ఏమిటి? నేనే నీ వాణ్ణి.

ర—అయితే ఆట చాలించండి.

ఉ—అయితే పాడుదూ కొంచెంసేపు. (తాను వాయిస్తూండగా రత్నమాల కొంతసేపు పాడును)...ఇదిగో ఈ రాజు మంత్రి ఇలా గుంటే ఈ రెండు పిక్కలు ఇలా గుంటే, అవి ఎరవి నీ జంతువలు మూడెత్తుల్లో కట్టివేయి చూస్తాను.

ర—మొదటి ఎత్తే తప్పింది. ఇక నేం కట్టను? పై మెంతయింది? (ఉమాకాంతం జేబులో చేయి బెట్టి) ఏమిటండో ఈ ఉత్తరం విప్పకుండానే ఉంచీశారు నే విప్పేదునా?

ఉ—ఏదీ? ను వ్విప్పొద్దు. అందులో ఏం లేదు.

ర—మరి నే చూస్తే తప్పు లేదు.

**ఉ**—నీ కేం బోధపడుతుంది? ఇంగ్లీషులో ఉంది.

ర—లేదు లోపల తెలుగులోనే ఉంది.

**ఉ**—ఇలాగ తెద్దూ తే. తే.

ర—ఉం డండి.

**ఉ**—చెప్పిన మాట విను. తే తెమ్మంటే.

ర—అయితే తీసుకోండి (అని విసిరిగొట్టి) మీ ఉత్తరా లెవరి క్కావాలి? మీ రెవరి క్కావాలి? నా మీద ఇంత నమ్మకం ఉందని తెలియ లేదు, ఇన్నాళ్ళూను. మీ అప్పులు రాసిన వుత్తరాలు చూడ్డాన్కి నా కేం పని? ఇన్నాళ్ళూ రానివాళ్ళివాళ్ళెందుకు వొచ్చేరు గుట్టు బయలుపెట్టుకోవడానికి. మా ముసల్ది అబద్ధం ఎందుకు చెబుతుంది. సెలవు. సెలవండి పంతులుగారు.

[నిష్క్రమి]

(తెరదిగును.)

---

# నవజీవనము.

## అంకము - మూడు

రంగము - ౧.

(రామకుమారి గృహావరణమందలి పువ్వులతోట.)

(రామకుమారి ప్రవేశము - పుస్తకం చదువుకుంటూ)

రా—నిజంగ బిల్హణుడు దేవుడా అనిపిస్తుంది. ఏమిటి పద్యాల సారస్యం. "అంధుం డెక్కడ చంద్రు డెక్కడ..." (పద్యం రాగవరసలో చదివి) మా మిస్స మ్మిలాంటి పుస్తకం ఉం దనే చెప్పింది కాదు. ఈయ నంటే నాలుగూ చదువుకోడం చేత ఏ పుస్తకంలో ఏ ముం టుందో తెలుసును గనుక తెచ్చేరు గాని... మొన్న మళ్ళీ నా పెళ్ళి సంగతి మాట్లాడే రాయన యెందుకు చెప్మా. చదువు సాంతం కాలే దప్పుడే పెళ్లేమిటి... (పుస్తకం చూస్తూ ఉండును.)

(ఉమాకాంతం ప్రవేశించును.)

ఉ—ఏమి రామ్కుమారీ! ఏం దీర్ఘాలోచన్లో ఉన్నావ్?

రా—ఇ దేమిటి తొమ్మిదయిన తరవా తిలా గొచ్చేరు. మీ లెక్చర్లులాగే మీరు చేసే పన్లుకూడా కొత్త తోవలు తొక్కుతున్నాయి.

ఉ—మెల్లిగా మాట్లాడు. నువ్విలాగ ఒక్కర్తెవూ ఈ తోటలో ఉంటావా, ఉండవా? అని మా ఆలోచించేను సుమా రావడాన్కి.

రా—సాయంత్రం రాలే దేమండీ?

ఉ—ఒక్కనాటికేం, నువ్విలాంటప్పుడు ఈ తోటలో ఈ వెన్నెట్లో ఈ పువ్వుల మొక్కల మధ్యను ఏలా గుంటావో ఒకమారు చూసి...... మరీ వెళదాం అని బుద్ధి పుట్టింది.

ర—ఏదో మాట మింగీశారు!

ఉ—మింగీడం కాదు. నాలుక చివర్నుంది. రావడాన్కి జంకుతూంది.

రా—ఏమి టది. అంత జంకుకి నా దగ్గర కూడాను.

ఉ—జంకేను. నీ దగ్గిరేను. మన ఖర్మం. మన దేశాచారాన్నుంచి కాని, ఇదే ఇంగ్లండయితే ఎంత స్వేచ్ఛ, ఎంత సౌఖ్యం, ఎంత ఆనందం.

రా—పర్యవసానం తేల్చండి.

ఉ—ఏం తేల్చను. నే నిచ్చిన్ది చదివేవా?

రా—ఓ. చాలామట్టుకు చదివేశేను. మా మిస్సమ్మ ఇలాంటి పుస్తకము ఉందని చెప్పిందే కాదండి.

ఉ—(పక్కు న్నవ్వి) మిస్సమ్మ, పుస్తకం, చూపించడం ఊనా? మతిలేక గతిలేక క్రైస్తవ మతంలో కలిసి, మేమూ ఓమను

ష్యులం అనే తల్ల ఎత్తుకుని తిరిగే మాలకులం మీా మిస్సమ్మది.
మిస్సమ్మసంగతే చెప్పావు? పాతికేళ్లొచ్చినా, చంటిపిల్లే. గాన
రా తప్పదు. ఎంతమందిని చూసినా, ఇంక పెళ్ళీడప్పుడే ఒచ్చిన
కన్నియ. ఇక చదువేమిటి? ఎందుకూ పొందనినాలుగు ఇంగ్లీషు
ముక్కలు; తల తోక లేని బైబిలు తెలుగు; ఇక్కడికిపరిపూర్ణ
పాండిత్యం. మత్తయసువార్తతోటి, మీామామయ్య సువార్త
తోటి మత జ్ఞానం. ఆలాంటి కిరస్తానపుది, ఏదో ఈమాయ
గవర్నమెంటు దయచేత మీాకు చదువుల్చెప్పుడానికి అమురు
కుంటే, నీకు చదువడాన్కి బిల్వాణీయం చూపించ లేదంటావు?
నక్కెక్కడ దేవలోకం ఎక్కడ. ...చదివేవానువ్వు? బోధ
పడిందా?

రా—కాని ఆ బిల్వాణుడు మాత్రం నమ్మక స్వామిద్రోహం
చేసేడు సుమండీ.

ఉ—ఏమిటీ! ఎవర్నమ్మేరు? ఏమని నమ్మేరు? ఏం ద్రోహము
చేసేడు? నీ కలాగెందుకు తోచింది?

రా—ఏమనేమిటి? చదువు చెబ్తానని వెళ్ళి కొసకి ఎవరికి తెలియ
కుండా......

ఉ—పుర్ణం నాడు సముద్రం పొంగడం మానుతుందా? ఎంచేత?
చంద్రుడ్ని చూశేనా? అందులో జరిగిన్ది లోకధర్మం,
ప్రకృతిమార్గం ఉన్నూ. విన్నావా. గురువు, శిష్యురాలు అని
మనుష్యులు పెట్టిన పేర్లు. స్థూలశరీరాన్కి సంబంధించినవి.

అసలు మనోభావాలు, తన్మూలంగా వచ్చే సంబంధ బంధాలు దైవకృతాలు. విన్నావా. ఈ భేదం ఎప్పుడు మరిచిపోకు. అంతరాత్మ సంబంధమైన విషయాల్ని, కేవలం రక్తమాంస సంబంధములైన విషయాలుగా ఎంచకు. నువ్వు ఇంకా చిన్నదానివి, కాని పెద్దపెద్దవాళ్ళే ఇలాంటితప్పులు చేస్తూంటారు. ఇలాంటివి తప్పులు అని పామరులందరికి గట్టిగ బోధ పడ్డానికేగదా మొన్న ఆ పరమపవిత్రుడు, ఆత్మశుద్ధుడు, ఆ శ్వేతగురువు, తన శిష్యురాల్ని, మనజాతిదైతేనేంగి, యౌవనంలో కొచ్చీవరకు దానికి జ్ఞానం నూరిపోసి తనతో రమారమి సమానజ్ఞానురాలైన తరువాత లోకానందంగా వివాహంచేసికొన్నాడు. ఇక నొకటి. బిల్హణుడు బ్రాహ్మడేనా?

రా—ఏమో.

ఉ—భేష్! బాగా చదివేవు. బిల్హణకవి బ్రాహ్మణుడు. యామినీపూర్ణతిలక క్షత్రియాంగన. వీ ళ్ళిద్దరికి శాస్త్రోక్తంగా వివాహము అయింది. పూర్వం అంతర్జాతీయ వివాహాలు గొప్ప గొప్ప ప్రముఖులే చేసుకొనేవారు.—చూశావా ఈ వాళ దశమింకాను. ఆచంద్రుడికి ఒంటిమీదకి యౌవనం పూర్తిగా రానేలేదు. అయితేనేం? మనస్సు నప్పుడే ... వాడి రాజసాన్కి ఏమి లోటు? గులాబిపువ్వు లేతదే అనుకో. అయితేనేం దాని ముల్లు వాడిగా ఉండదూ.

చూడు చూడు. మబ్బులోకి పారిపోయేడు. కారణం ఏమిటో తెలుసునా?

రా—దీని క్కారణం ఏమిటి?

ఉ—బాగు ది. నీమొగం చూసి సిగ్గుపడి పారిపోయేడు.

రా—అబ్బో.

ఉ—అదిగో నువ్వు మొగం వంచుకుంటే మళ్ళీపైకి రాగలిగేడు. ఏ దేదీ? ఆ ఉంగరం ఏం మెరుస్తున్నాది. మంచి దొకటి నే కూడా చేయిస్తునా?

రా—మొగాళ్లకి నగ లేమిటి?

ఉ—నా కోసమా? మరి నీ చేతిగ్గాని

రా—నాకు మీా రెందుకు ఉంగరం పెట్టడం?

ఉ—అలా గడుగు; మన కలిసిన స్నేహాన్కి—

రా—నా కక్కర్లేదు.

ఉ—నే నిచ్చీ ఉంగరం ఆ వేల్ని పెట్టుకోకూడదతా? నా ఉంగరం ఆమాత్రం పుణ్యం చేసుకోలేదతా? ఇదే పారిసులో పిల్లలయితే ముద్దెట్టుకుని మరీ పెట్టుకుందురు. నే చెప్పలేదతా ఇదంతా మన దేశాచారా ల్నుంచి, మన సంఘం దురదృష్టంనుంచిన్నీ ముఖ్యంగా నా కర్మంనుండిన్నీ. ఏది ఆ చెయ్యిలా గియ్యి. (లాగబోవును)

రా—(తప్పించుకొని) ఎవ్వరైనా చూస్తా రుండండి.

ఉ—ఇప్పుడెవరు చూస్తారు?

రా—అయితే మాత్రం.

ఉ—అయితే ముట్టుకో కూడదు నిన్ను?

రా—ఎందుకు?

ఉ—కారణం గావాలా?

రా—ఓమా రిప్పుడు ముట్టుకోవడం ఎందుకు పోనిండి.

ఉ—చెప్పమన్నావా?

రా—పోనిద్దురూ

ఉ—ఏదీ నన్ను చూడు

రా—ఏమి?

ఉ— నే నంటే ఇష్టం లేదు?

రా—నే లేదన్నానా?

ఉ—అయితే ఆచె య్యిలా గియ్యి ఒకమారు.

రా—మళ్లీఅదేనా?

ఉ—ప్రాణం లేని ఆ ఉంగరంపాటే చేసేను కానా? నే పట్టుకో కూడ దావేళ్ని? ఏదేశాలులోనో నేసిన ఆ చీరపాటేచేసేను కానా? నీ ఒంటిని నే నంట గూడదూ? (అని దగ్గరసా చేర బోవును)

రా—నాకు నిద్రవస్తూంది; నే పోతాను; న న్నేమి చెయ్యకండి

ఉ—ఇదిగో

రా—మానాన్న వచ్చినా తంటా; మీరు వెళ్ళండి.

ఉ—మీా నాయ నిప్పుడు రాడు.

రా—బాగుం దో స్తేనో?

ఉ—మళ్ళీ అదే. కాక నేకా దొకవే ళొ స్తే ఇంగ్లీషు మాట్లా డుతూ కూర్చుందాం. చూడు నా వేపు. కొంచెం ఇసింటా రా. ఆ చెట్టు నీడ పడి మొహం సరిగ్గా అవుపించడం లేదు.

రా—రోజు చూస్తున్న మొహమే కదూ.

ఉ—ఏం మాటన్నావు! రోజూ కాదు. ప్రతి నిమిషం కూడా చూస్తూ ఉన్నా తనివి తీరుతుందా? నా శరీరం ఎక్కడున్నా నా మనోదృష్టి ధారలు ఎప్పుడు నీ ముద్దుముఖంమీాదే పడే లాగ వర మియ్యరా దేవుడా అని నిన్న రాత్రి అల్లా దేవుణ్ణి ప్రార్థిస్తూనే యున్నాను.

రా—ఏం మాటలు నేర్చుకున్నారండి.

ఉ—నేను మాటలాడ్డమే నేర్చుకొంటే నీకు నాకు ఇన్నాళ్ళు ఇంత దూరం ఉంటుంది? సరిగ్గా మాటలాడ్డం చాతనైంది కాదు కదా, అని నే నెంత దుఃఖపడుతున్నానో నీకు తెలియదు.

రా—ని ద్రొస్తున్నాది. పోతానండి.

ఉ—మళ్ళి నిద్రంటావు? నిన్ను చూస్తే నా నిద్రంతా ఎగిరి పో యిందికదా! ఈ వెన్నెట్లో ఇలాగ నా కెదురుగా కూర్చొని మాట్లాడుతూండగా నిద్దర వస్తూన్నదంటే నే నమ్మను.

రా—రేపు రండి. నా కిప్పటికి సెలవు యిప్పించండి.

(లేచి నమస్కరించును)

ఉ—అబ్బో! ఈ మర్యాద లెక్కడ నేర్చేవు?

రా—కోపగించక-

ఉ—కోపమేం. నీ దాసుణ్ని నువ్వు కటాక్షిస్తేనే నాకు బ్రతుకు. వచ్చినవాణ్ని వచ్చినట్టే వెళ్ళమన్నావా?

రా—పోని ఆ తోవంట వెళ్ళండి.

ఉ—ఇంతేనా?

రా—ఈ పువ్వుల్దండ నేనే గుచ్చేను. తీసుకు వెళ్ళండి.

ఉ—ఇలాగే పాణిగ్రహణము వేళలప్పుడు భర్త మెడలో భార్య వేస్తుంది.

రా—అక్కర్లేని మాట లాడకండి. నేను మీ మెళ్లో వేసేనా?

ఉ—వేస్తే బాగుండు నని అంటున్నాను. పోనీ అయితే నన్ను వెళ్ళమన్నావా?... అబ్బబ్బా పలుకే బంగారం. మాటాడు దూ - ఆచెయ్యేది?

రా—జాతక ం చెబ్తారేమిటి?

ఉ—నాకు చేతనైనద్దే అది.

రా—ఏది చెప్పండి చూస్తాను.

ఉ—నువ్వు రామినాయుడు కూతురివి. నీకుపద్నాలుగేళ్లున్నాయి. నీ పేరు రామకుమారి. నీ కింకా పెళ్ళి కాలేదు. నీ క్కావలసిన వాణ్నే, నీ జాతి కాకపోయినా పెళ్లాడుతావు. కళ్యాణ లగ్నం కూడ దగ్గర పడుతూంది.

రా—చాల్చాలు.ఎప్పుడూ ఒకటే ముక్తాయింపు. మంచి జ్యోతి

షం నేర్చేరు—అడుగో మా ఎర్ర డొస్తున్నాడు. ఏ మను కుంటాడో ఏమిటో. ఎలాగ ఊ

ఉ—నే వెళ్తాను వెళ్తాను. ఈతోవంట వెళ్తాను. పడుకో పోయి. పది అయింది వెళ్తాను. (నిష్క్రమించును)

తెర దిగును.

---

రంగము—౨

---

[శంకరశాస్త్రి గృహము.]

[ప్రవేశము:—నరసింహము, ఉమాకాంతము, శంకరశాస్త్రి]

నర—శాస్త్రీ! నువ్వు చెప్పినట్టే నిశ్చయం చేశాన్రా.

ఉ—అదేమిట్రోయి? నాతో చెప్పకుండానే! వా డేమిటి చెప్పేడు? నువ్వేమిటి నిశ్చయంచేశావు?

నర—మా చెల్లెల్ని ప్రయాణం కట్టేశాన్రా.

ఉ—అదేం అలాగ?

నర—సంసార వ్యాపకంతోటే రోజంతా పొద్దెక్కిపోతూంది. ఏదో క్లబ్బులో ఉంటే నిర్భాచీగా కాలం గడిపీవచ్చును. మరి శాస్త్రి కూడా ఇంటివాళ్లు క్వార్టర్లీ టిచ్చినట్టు కనబడుతుంది. వీడు కూడా మాయింటికే వచ్చేస్తాడు— ఏమిరా! ఈవాళ పరాగ్గా ఉన్నావు?

ఉ—శా స్త్రికా క్వార్ట ర్లీ టు?
నర—మరలాగ నిశ్చయించేశాం.
ఉ—అంతేనా ?నిశ్చయం మారదతా? పంపీచీస్తావా? పంపించీశే సేవా?
నర—బండికోసం వచ్చి ఇలాగ మిమ్మల్ని చూచిపోదా మని ఒచ్చేను. రైలువేళయింది, పోతాను.
ఉ—అవు నేమిట్రాతొందర? ఇం తకస్మాత్తుగ పంపించీడం ఏలరా? నాలుగూ చూపించనై నా లేదుగదా! ఓ నాల్గురోజు లుంది, మ్యూజియమ్కి, సినీమాకి....
నర—వాళ్ల మొహం. వాళ్ల కెందుకురా అవి? బోధపడాలా చెయ్యాలా? వాళ్ల కిలాంటి వేం బుర్రకెక్కవు. మొన్న నోమారు తీసుకెళ్తానంటే మేమేం సంసార్లం కామనుకు న్నావా అని పడ చీవాట్లు పెట్టేరు. చూసేవా సిద్ధం అయిన ప్రయాణం. మీ అన్నయ్యకి వై రిచ్చీసే నప్పుడే.
ఉ—ఎక్కడున్నం చొచ్చిందిరా ఈ. ఇఁస్పి రేషను— వెర్రివేషాలు వెయ్యక కూర్చో. కావలిస్తే నాలుగు రోజులు పోనీ; నే కూడా వస్తాను. చూ డీ చేతికర్ర మొన్నా వైజాగ్లో చేయించాను.
నర—అన్నా అంతా సిద్ధం అయిన తరువాత....
ఉ—అయితే చెప్పిన మాట విన్దం లేదూ?

శం—నీ కేమిట్రా మధ్యను, వాళ్లకి పోవాల్నుంటే వీడికి పంపిరిచేయాల్నుంటే?

ఉ—అయితే మీ యిష్టంవచ్చినట్టు చావండి. సచ్చిపొండు మీ యిష్టము వచ్చినట్టు... పచ్చబద్దల వాహానమంట పొండు.

నర—పంపించి వస్తా

[నిష్క్రి]

ఉ—శా స్త్రీ! మనం అయితే రేపట్నుంచి బాగా చదవాల్లా గుండే.

శా—చదవాలి. ఈ రాయలెకాడమీ చూస్తుండు. ఇప్పుడే వస్తాను (నిష్క్రి).

ఉ—నా కీ రాయలెకాడమీలు ఈ బొమ్మలు కనిపిస్తాయి ఇప్పుడు? స్టేషన్కు నరిసింహంగాడ్ని దిగబెట్టిడాన్కి వెళితేనో. ఎందుకుం మరింత విచారాన్కి? కమలా! ఓ హా వీన సాఫీ డ్రెస్! కమలా! కాముకుల్కి కల్పవృక్షంనివనుకొన్నాను. అదృష్టం ఇలాగ కుంభవృష్టిగా కురిసిపోతుందనుకున్నాను. ఏదోసుడిగా లొచ్చి కొట్టేసింది. గుడ్డిముండా అదృష్టదేవత నెన డ్నమ్మ మన్నాడు? నిలకడకూడా నా? శా స్త్రిగా డిస్నిప రేష నేసం దేహంలేదు. ఇంతకూ, కాముడ్ని పంపించేస్తే నా కొచ్చే నష్టం ఏమిటి? ఆంధ్రు లంటే సంఘసంస్కరణానికి వెనక దియ్యక ఎప్పుడు ఓ అడుగు ముందునే ఉంటా రని లోకానికి

వెల్లడి చేద్దా మనుకున్నాను గాని, ఇదేం పెర్సన లెఫ్ఫై రా ఏమిటి? ఇలాంటి సిల్లీ అప్సెటింగ్స్ చూసే, బుద్ధిమంతు డెవడో మా ప్రపోజె స్గా డ్డిస్పోజె స్సని అన్నాడు. ఎంత ఫోరై స్టుంటే నేమిటి, ఎంత లేసి బ్రహ్మాండం బద్దలయినా ప్లాన్లయితే నేమిటి? ప్రసిడెంటు విల్సన్సు లీ గా ఫ్నేషన్సులాగ నా లీ గా ఫ్లర్స్ డిజాల్వాయి పోవడానికి సిద్ధంగా ఉంది.

అయినా వట్టిః కప్పల తక్కిడి మనచవట్లు. వీళ్ళ మొహాలికి సోషల్రిఫార్మ్ సెల్ఫ్ గవర్న మెంటు! నూరి చెప్పడానికి నా గొంతుక బద్దలయి, వినడానికి వాళ్ళ చెవులు బద్దలయినాగా, పెద్దమ్మా గ్రేసరులారా! సోష ల్రిఫార్మ్ మస్టండ్షు ప్రీసీ డ్పొలిటికల్ రిఫార్మని నెన్నిమాట్లు ఘోష పెట్టేను. మటీః మరీః బుర్రల్.

నిజంగా ది వరల్ డీ జవుట ఫ్జాయింట్. అందులో ట్రాజడీ ఏమిటంటే ద క్లై షు డ్బీ బోర్న్ టు సె టిక్రైట్. నా డా హామ్లె ట్పుట్టేడు, నేటికి నే బుట్టేను. దీనికి వక్కటే కారణం. అ యే ప్లికయర్లీ మచ్చి నెడ్యావ న్నాస్ఫ్ టయిమ్స్. ఇది వక్కటే కారణం. కాని మన్సైతులో మరో ఫీల్డుంది గదా.

[శంకరశాస్త్రి ప్రవేశించును]

శ.—ఏమిరా అబ్బాయి.

ఉ—ఏమిరా జంతువా?

శం—ఉహూ. ఈ రాత్రి మనం డిబేటింగు సొసయిటీ మీటింగు కెళదామా?

ఉ—రబ్బిష్. నెవ్వ ర్సైం డైమ లొ్బ్లయి జ్యా. కా సలాగో మూరు షై. రెళ్ళి వస్తాను. నువ్వొస్తావా?

శం—నే నెట్లారా గలను? లీబ్నిడ్జింకపూర్తి చెయ్యలే. నువ్వెళ్ళి తొరగా రా. [ఉ. నిష్క్ర.]

శం—మొహం జంతువ కెట్టా మారిపోయింది?

---

రంగము - 3.

---

[రామకుమారి గృహం.]

రా.కు.—నిజంగా మన దేశంఎంత నవ్వుబా టయిపోయింది; ఈ జాతిబేదాలవల్ల. ఉమాకాంతంగారు చెప్పినట్టు బ్రాహ్మర్ల గర్వాన్కి-సిద్ధాషధం పటేలుస్బిల్లే. పూర్వం లేనేలే వటీలాంటి అసందర్భ నిర్బంధాలు. మా తాతగారి తండ్రి మేనల్లుడు బ్రాహ్మణ స్త్రీని పెళ్ళాడేడని మా నాన్నే చెప్పాడుగదా. అంచేత మనదేశం బాగుపడా లంటే శూద్రుల పిల్లల్ని బ్రాహ్మర్లు, బ్రాహ్మర్ల పిల్లల్ని శూద్రులు బాహాటంగా

పెళ్ళాడ్డమే మంచిదికాబోలు, ఉమాకాంతంగారు చెప్పిన మోస్తరుగా.

[రామినాయుడు ప్రవేశించును]

రా.నా.—ఏ టమ్మన్నా! సదువుతున్నావా? ఇన్నాళ్ళయింది. ఆయనా అడగనేదు, నేనూ అడగనేదు. జీతం సంగతి ఏ టయినా అన్నాడా నీతో?

రా.కు.—లేదు. ఓమా రడిగితే పట్టింపేమి టన్నారు. ఎంతో మొదట ఒప్పుకోలేదూ?

రా.నా.—నేదు. ఎంకునాయుడు వప్ప సెప్పినాడు.

రా.కు.—వచ్చే వేళయింది కూడా. అడుగుదువు కాని.

[ఉమామాకాంతం ప్రవేశించును]

రా.కు.—ఇదుగో! దండం అండి. ఏటి బేగి ఒచ్చేసే రీయేళ!

ఉ—మొన్న నోపాఠం ముగిలిపోయింది. కొంచెం ఇంగ్లీషు కృషి కూడా మొదలుపెట్టేం కొన్నాళ్ళయి.

రా.నా.—అనాగాండి. మా అమ్మికి ఇంగ్లీ నేపా టొచ్చునండి?

ఉ—అలాగంటే నే నేం చెప్పగలను? (కూర్చొని) చదివిస్తాను విను మామా. రామకుమారీ! ఇదిగో ఇది చదువు, మీ అయ్య విని సంతోషిస్తాడు.

రా.కు.—(చదువును)

Awake Awake ye girls of Bharat
From the wakeless soulless stupor
From the mystic social lot;
Awake Awake ye Girls of Karmaic Land
Awake to sing in chorus
The March of the chosen band.
Nor the first nor the last dawn...

రా.నా.—సదువు కేటి? మాటాడండి యింటాను.

ఉ—రైటో. హియర్మి. మై డియర్! వాటీజ్ది ప్రోబ్లెమి న్పుటే ల్సి ల్?

రా.కు.—దిప్రోబ్లెమీజ్కేనే న్నాన్బ్రిహ్మి న్మేరీ ఏబ్రాహ్మిణ్.

రా.నా.—ఏటండీ బాపర్ల గురించా.

ఉ—ఊ. ఇండియా దేశంలోగల మనుష్యులు బ్రాహ్మణ్లు, బ్రాహ్మణేతరులు, రెండు విధాలు అని చెప్పింది. మై హార్టు! డూ యూ నా ల్లై కిన్టర్మేరిజిస్?

రా.కు.—దే మే నా ట్బీ జేడ్.

ఉ—బ ట్లె ల్మీ వెద ర్యూ డూ నా ల్లైకే బ్రాహ్మి న్మేరీ యింగ్యూ?

రా. కు—అయి కెనా ట్సే నవ్.

ఉ—సే దట్యూ విల్. అయి ప్రే యూ.

రా.కు—బ ట్వేరా ర్రాబహిమ్మన్స టు మేరీ నాయుడూ గర్ల్స్?

ఉ—హియ ర్డియర్. హౌ వ్వెల్డో జ్వర్డ్సు డ్రాఫ్ట్ ఫ్రమ్ యువ ర్కోర ల్లిప్స్. ఏ థవుజం డ్కిస్సెజ్.

రా.కు—అయి డోన్ట్ లైక్.

ఉ—డోం ట్బీ యాంగ్రి మై లైఫ్

రా.కు—నో నో.

ఉ—ఇంతమట్టు కేటం డేవి టర్థం?

ఉ—మీా నాన్న కేం ఉద్యోగం అని అడిగితే మా నాన్నకి ఉద్యోగం ఖర్మం ఏమని తర్కిస్తూంది. మా మాటకారి సుమా నీ కూతురు మామా.

రా.నా—సిత్తం.

ఉ—ఆస్క్యవర్ఫాదర్ టు క్లైండ్లీ వాకాఫ్. సే యూ హోవ్గాట్టు రీడ్.

రా.కు—నాన్నా నువ్విందాకా ఎక్కడికో వెళ్తానన్నావు.

రా.నా—అమ్మీా నే నిందాక సెప్పిన సంగతి అడుగు ఇంగ్లీసు లోన.

రా.కు—హీ యీా జాస్కింగ్‌యూా ఎ బట్యు వ ర్ఫే

ఉ—ఓ నో అయిడోం ట్వాంటెనీ పే యాజ్లాంగా జ్యూ ఆ ర్తైన్. మామా దీని కింత యాలోచన ఎందుకు? తర్వాత చూసుకుందాం. ఇంతకు జీతము పుచ్చుకోవడమా అని ఆలోచిస్తున్నాను. నీకు పనుంటే నా ఆలస్యము లేదు.

రా. నా—సిత్తం. చెల విప్పించ డోమారు. సమ్మేస్ట్రీటుగారు పిల్చినా రెల్లి వస్తాను.

ఉ—మహా సంతోషం. (రా. నా. నిష్క్ర-)

రాముక్కుమారీ! నిశ్చయంగా చెప్పు. దగ్గిరిసా రా. నేనంటే ఇష్టం లేదూ? ముద్దంటే వద్దన్నావు గదా. మాటనే సరికి గుండె జారిపోయిందే. ముద్దు పెట్టుకుంటే తప్పేమిటి చెప్పు. వాసనజూస్తే ఈ పువ్వు కేం లోటొచ్చింది? నే చెప్పేను కానూ. ఇది మన సొసయిటీ డిఫెక్టు. మన్ని పాడు చేసి సాంఘ్యక్రతాచులో మన్నిహతప్పాతాళాన్కి అణిచేసిన అనాచారం యిదేను. స్నేహితు లిగ్లండులో ముద్దుపెట్టుకుంటారని నే నిచ్చిన పుస్తకములో చదవలేదు? ఈడొచ్చిన పిల్లని ఈడొచ్చిన చిన్నవాడు ముద్దు పెట్టుకోనడమే ముద్దు పెట్టుకోవడం. నాల్గురోజులు కళ్లు తగులబెట్టుకొని నిప్పుముందర కూర్చొని బాధపడ్డ వాళ్ళకే గాని ఇతరులి కక్కర లేదూ ముద్దుఅని పిలవబడే ఆరమ్యమైన వస్తువ? మనసు మనసున కలికితే ముద్దు. అలాంటప్పుడు నీ అంతట నువ్వే నన్ను ముద్దు పెట్టుకోవలసిన దానికి నా అంతట నేనే అనురాగ విశేషంగా అడిగితే వద్దంటావు? ముద్దొస్తే ముద్దు పెట్టుకో కూడదూ, చెప్పు. నీ చేతి వేళ్ళ చిగురును ముద్దు పెట్టుకుంటే వకటిన్నీ, నీ చెక్కుటద్దాల్ని ముద్దుపెట్టు

కుంటే మరొకటీనా? దొంపండులాంటి ఆ పెదివలు ముద్దు పెట్టుకోడానికికాకుంటే వాటిన్నిర్మించడంలో బ్రహ్మకు వేరే అర్థం ఏమిటుంది? మొన్న నేను వ్రాసిన ది ఆర్టు ఆ ఫ్కిసింగ్ అనేపాయెం నీకు చదివి వినిపించేనా? అది బోధపడిందా? ఆ పొయమ్కే గదా లండను బుక్మను వాళ్ళు ది బెస్టు ఒరిజిన ల్లిరిక్ అని నాకు ఈమెడల్ ప్రైజు పంపించేరు?

రా.కు—అది కాదండి. ఇంతలో మరేమిలేదని తెలుసునుగాని మా నాన్నముందుకానే?

ఉ—ఎంతమాట. అప్పుడే మీా నాన్నముందర నిన్ను ముద్దు పెట్టుకుంటానా; ముందతనికి సఫిషెంటుగా ఈ విషయం ఎడ్యుకేటు చేయందీని? సరి ఇప్పటికి గుండెలు గుదటబడ్డాయి. మరి నే చెప్పిన విషయం ఏమి టాలోచించేవు?

రా-కు—ఆలోచించేను కాని నాకు భయంగా ఉంది.

ఉ—భయమెందుకు?

రా-కు—ఎందుకంటారే?

ఉ—(మెల్లగా వంగొని చెప్పును) వెర్రిబాగుల్దానివిలా గున్నావు చూడబోతేను. నిన్నను బర్తుసు రిజిస్ట్రారాఫీసులో ఏభైరూపాయిలు అక్కడవాళ్ళమెదాన్ని కొట్టి నీ బర్తు డేటు 1905 నుంచి 1901కి మార్పించేను. అంచేత లీగల్‌పస్పకట్టు చూసినా మనకిభయంలేదు. బాగుంది. పైవాళ్ళకోసం మా బ్రహ్మో సమాజంలో పడ్డ బాధలు, వాటి యక్స్పిరియన్సు ఎక్కడికి

వెళ్ళే యనుకున్నావు? ఈవాళ్ళనుంచి రాముక్కుమారికి ఎన్నేళ్ళంటే పద్దెనిమిద్దాటేయనే జవాబు. లేదు మీ అయ్యా పధ్నాలుగే అంటున్నాడంటే పెళ్ళికావలసిన పిల్లల వయస్సు దాచడం తల్లిదండ్రులికి లోకాచారమే గదా అని ఎక్స్ప్లనేషనూ. విన్నావా? ఏమంటావు?

రా-కు—ఊఁ- కానా కేం పాలుపోలేదు.

ఉ—తొందరపడితె ఎలాగ? ఒక్క తొమ్మిదినెల్లు ఆగు. ప్రస్తుతం మాత్రం నే చెప్పినట్టు చెయ్యి. మళ్ళీ ఎవరో వస్తున్నారు. నే వెళతాను. రే పొద్దున్న కాఫీవేళకి నీ వుత్తరం కోసమయి ఎదురు చూస్తుంటాను. కాఫీలోకి పంచదార నీ వుత్తరంలో ఉండీ మాట లేసుమా. విన్నావా. మరిప్పుడు వెళ్ళమన్నావా?

రా-కు—మీ యిషం.

ఉ—నాయిష్టం యేముంది నీదగ్గర? ప్రాణదానం చేసినదానవై సప్తమహార్షుల్లాగ సంఘ సంస్కారణాగగనంపైని ప్రపంచకం ఉన్నంతకాలమున్నూ నీ పేరు ప్రకాశించాలి. ప్రకాశిస్తుందని నా నమ్మకం. వెళ్ధునా?

రా-కు—మంచిది. (అని నమస్కరించును.)

ఉ—శీఘ్రమేవ కళ్యాణ సిద్ధి రస్తు. (నిష్క్రమించును.)

---

# నవజీవనము.

## అంకము - నాలుగు

---

### రంగము. ౧

[రత్నమాలగృహంముందు వీధి.]

బిచ్చకురాలు—పెట్టేది నేదు. పోసేది నేదు; తిట్టడానికి మాత్తరం పెద్ద గురువులు. డబ్బంతా ఎటి సేసుకుంటారో. కల్లు మూసుకొని కాట్లోని కెల్లేటప్పుడు మూట కట్టుకోని పట్టుకుపోతారు కావాల. అంత మారాజానందగజపతే రాజ్యం అంతా యెనక ఒగ్గీ సెల్లిపోనాడు. ఈ ల్లనగా ఎంత లోదేటి. పరమాత్తుడి దయ్యోల్ల ఏదో నాల్గు డబ్బులు కల్ల సూచి ఎంత కల్లు మూసికోపోతున్నా యీఅవిచ్చర్యమంతులికి! ఇటొత్తే మీదని గుఱ్ఱప్పండి ఎక్కించీస్తోడో పంతులు. అటొత్తే కుఱ్ఱనాపాపలదేటో కాల్తా తొక్కుకుంటూ ఆ తైక్కించీస్తారు మీద నాళ్ళబండి. ఒక్కసారి ఆళ్ళు సుట్టాలొత్తే యీదిలో పారపోసే టంత గద్దైన లేదు ఈ పొట్టకు కావలసిన కాసింత తిండీని. ఓ పాతగుడ్డ

పీలి కెట్టమంటే గింజుకుపోనాడా నన్నాస్సెట్టి. వ్వో. ఈ కాయితం సూపిస్తే అంతా అపత్తం అని అనడాని కా డ్నోరెనాగొచ్చిందో, ఎనక మూతినాగ మొకంన్నా ఘలు సుదాక నాటి బొజ్జ యెట్టుకోని. ఇందులో యేటి రాశాడా దరమ్మనాత? నాకొక్కడు కొక్కడేను. ఆ యింత సెట్టునాంటి కొడుకు ఎంత బతిమాలిన యినక యెల్లి విద్దంలో సచ్చి పోనాడు. నా కక్కడుపుకి నేద నేనా? అమ్మా దరమ్మతల్లీ! తిండికి లేని దాని న్నేనమ్మ! గుడ్డకు లేని దాననమ్మా!మహా రాజు తల్లీ! మాలచ్మి తల్లీ! నువు పెట్టిన మా టుండిపోతాది కలకాలమున్నా. మాయమ్మా! అక్కపచ్చినమ్మా! అనాద నమ్మా! నారాయణా నారాయణ! ఆ దిక్కులేనోళ్లపాలింట ఆపత్బందూ; మహారాజు తండ్రులారా! మహారాజు తల్లు లారా! ఒక్క పొట్ట మా యమ్మలారా! నారాయణా! నారాయణా! గోవింద గోయింద—.అమ్మా దరమ్మ తల్లీ.

[ (లోపలినుండి) పో పోవె చెవి బద్దలుగోడుతూ ఎవర్నువ్వు? పో]

బి—రత్తాలతల్లీ నువ్వా పొమ్మంటావా?

రత్నమాల—(పైకివచ్చి) ఎవర్నువ్వు?

బి—అమ్మమ్మా! ఈ సీటి సూడు (అని చేతికి ఒకకాగితం కట్ట యిచ్చును) సెట్టునాంటి కొడుకు తల్లీ.

ర—(కాగితాలు ఒకటి తరువాత ఒకటి చూస్తూ) ఉం డుండు. నీ కెక్కడి దీకాగితం?

బి—అమ్మా! అ ల్లాపంతులు రాసిచ్చినాడమ్మా.

ర—అయితే తీసుకో [అని ఒక కాకిత ముంచికొని మిగిలిన విచ్చివేసి] నీకేం కావాలి?

బి—నువ్వు కట్టుకోని పారేసిన సింకిగుడ్డముక్క.

ర—ఉండు. (లోపలికివెళ్ళి ఒక గుడ్డ తెచ్చి) మరి పో.

బి—సిట్టిపాదా ల్లల్లీ! నీ కెయ్యి మంది కొడుకు లుట్టి నూరేళ్లు నిండా యిచ్చుంటా త్తల్లీ! (నిష్క్రమించును).

ర—(కాకితం సరిచేసి) మొదట బోధపడకుండ ఉంది "నీకై నా సర్వస్వము 1విడనాడితిని" ఎవరి కెవరు? సంతకం నిండా లేదుకదా. "కా". ఈ "కా" ఉమాకాంతంగారిదే. ఈ"నా" కూడా ఆయనద్దే. నాకు రాసి నుత్తరం దీన్చితిలో కెలా గొచ్చింది చెప్మా? ఎంత పాపం చేసేను, అపనమ్మకంపడి? చెప్పుడు కబుర్లువిని చెడేవుసుమీ అని సామెత ఇందుకే పుట్టింది. అప్పట్నుంచి మనసు విరిగిపోయింది కాబోలు, మరి కనబడలేదు. తర్వాత...దీనికేం. నాకు రాశినపుడు నే అందంగా ఉన్నానని రాయరూ? ..."మీ తండ్రి" ...నాకు తండ్రెవరు? వెర్రిబామ్మల్లాగున్నాడు. అక్షరాలు పోయేయి ... "అంతర్జాతీయ వివాహ సమస్యగూడ పరిష్కరించినవారలమగుదుము:."...మరయితే దీనికింత ఆలస్య మెందుకు..."నీ పేరుగూడ కలకాలమును సంఘుసంస్క

రణ మార్గదర్శిక యని అంధకారయుతమైన మన సంఘ గగనముయొక్క తమమును వారించుచు ప్రకాశించును.”... అందుకోసమనే గదా ధనాపేక్ష వదులుకొని ఈ అడియాశను పెట్టుకున్నాను. “... నాయుడుకూడ మ...న మమాయ...కులమనియే...” ... “కావున ఈ సమయము నెటులయినను ... చే జిక్కిన నిక్షేపమును జారవిడుచు వెర్రి ఎవడు?”... “నీకు గల చతురతయందు నూరవపాలు ... ప్రయోగించితివేని” ... అర్రరే! అయితే ఈ వుత్తరం నాకు వ్రాసినది కాదటా? ఈ దస్తూరి ఆయనదే. నాయుడూ, కూతురూనా. అంచేతనే “తండ్రి” అంటే తెలిసిందికాదు. ఆ సొగసు, ఆ వర్ణన నన్నే అనుకొని భ్రమించేనే! పిచ్చి కాకపోతే మొన్నటయిన ముచ్చటంతా చూసి, మా ముసల్ది చెప్పినదంతావిని, ఇంకా ఇచ్చ్యాసి భ్రమించడమేమిటి? బ్రాహ్మడ్ని, అందులో బ్రహ్మచారిని ఎవ డ్నమ్మమన్నాడు. నీతి లేని జాతి కాల్పనా?

తల్లీ! తల్లీ! నీ కడసారి కోరిక నే నెరవేర్పగలనా? సందేహంగా ఉంది. తండ్రీ! జగద్రక్షకా! నా డా సతిని స్వర్గ ద్వారములోనుంచి, “సన్యాసి సతులిక్కడపనికిరారు; సంసార కృత్యాలు సరిగానడుపుకుని మరీరమ్మ”ని పొమ్మనివేసినావు. మా తల్లిమాట విన్నామని, నీ ఆజ్ఞను శిరసావహిద్దామని,

వృత్తి వదులుకొని, నాకు మహారాణీ భోగం సమకూర్చే భాగ్యవంతుల్ని వదులుకొని, వివాహితనయి మిగిలిన కుల స్త్రీల లాగ కాలం గడుపుకుందామంటే, నీ ఆజ్ఞ గడవడానికి నా తరమా? పూర్వజన్మాన్ని ఎంత నోచుకుంటే అంతే ఈ జన్మంలో ఫలం.

కేవలం దైవవిలాసార్థం కళాచాతుర్యలై దేవదాసీలుగ ఉండినకాలం, చెప్పుకొందుకు తప్ప, మరి లేదు మా కులానికి. పురుషబుద్ధి హేతువచేతనే దేవదాసులందరు వెలకాంతలై, వేశ్యలై, శ్రీహరీ! తుచ్ఛబుద్ధులను సంతృప్తిచేయడానికిపుట్టిన మానవయంత్రాలుగ మారిపోవగ, ఇప్పుడు ప్రతివాళ్ళుకూడ యాంటినాచ్చని ప్రాస్టిట్యూషననిన్ని మాకూడుపడగొట్టడాన్కి సభలు, సమావేశాలు, ఉపన్యాసాలు. వీళ్ళకు నీతి అంటూ ఒకటి ఏడిస్తేనా? ఈ వూళ్ళో సంసార్ల సంగతులు ఎవరికి తెలియవు?......

అయ్యో! మాయశరీరం జూచి మన్మధుడు నా కోసం అవతరించే డనుకున్నాను. లోకం అంతా తారుమారే! ఈ ఆశ మరి వదలిపెట్టుకోవడమేనా?... కానీ, ఈ మా రెప్పుడయినా కన్పించడా? నా సంగతి అప్పుడే తెలుసుకొంటాడు. బ్రాహ్మడ్నా? నా పాదాలమీద పడేలాగ చేయకపోతే నే దేవాంగనల కపరావతారమే కాను...ముసిలీ! ముసిలీ!

[ముసిలి ప్రవే.]

చూడు! ఈ మారు ఉమాకాంతంగారు ఇంట్లోకి వస్తే నే కాశీయాత్రకు వెళ్ళి పోయేనని చెప్పు. తెలిసిందా?

ము—అనా గేకా నమ్మి అదేటి?

ర—దీనీలో ఒక మజా వున్నది. అటువయిని చూద్దాం.

మున—నే మొన్న చెప్పనేదూ. నా మాటింటివా? ఒయిసు కావరం అనా నేస్తాది.

ర—అయిన్దాని కేమిలాభం? ఏ నా డెలాగావుతుందో బ్రహ్మకు తప్ప ఎవరికి తెలుస్తుంది చెప్పూ. మరిచిపోకేం.

(తెర దిగును.)

శంకరశాస్త్రి గృహం.

[శంకరశాస్త్రి రంగాచారి ప్రవేశింతురు]

శంక—ఏమి ఆచారీ! ఉమాకాంతం పరిక్షకు సెట్టలేదట. రైటరు పోద్దున్న డిగి తేచదువుమానీనేనన్నాడట. నీ కేం తెల్సా?

రంగ—లే దబ్బా నువ్వు వాడ్ని చూసి ఉండ లేదూ?

శ—లేదు; వాడు కనపట్టమే మానేడు.

ర—నరసింహంతో చెప్పి ఉండాడేమో.

శ—లేదు.

ర.—ఇంటిదగ్గర ఏం చిక్కు వచ్చిందో అబ్బా.

ద—నిన్న నే ఆఖరు. ఏ మట్టా జేసేడు జంతువ? అయినా వీడికి వేషాలు మహా ఎచ్చగుతున్నాయి.

[ఉమాకాంతం ప్రవేశించును.]

ఏమిరోయి జంతువా?

ఉ—గుడ్మార్నింగు మై లైఫ్.

శ—నీ గుడ్మార్నింగు పాడిపెట్టా. పరీక్షకు సెట్ట లేదట. ఇట్టా రా. పిచ్చి పిచ్చి వేషాలు వేస్తున్నావేం?

ఉ—ఇదా మీకు పెద్ద సమస్యగా పరిణమించి మీ స్వల్ప బుద్ధులను బాధల నిడుచున్నది యేమి?

శ—జవాబు చెప్పరాదా?

ఉ—ఎమిటో వేధన చదు వనిపించిందిరా.

శ—అట్టా వైరాగ్యం పట్టిం దేమి?

ఉ—ఈ చదు వ్వల్ల దేవుడి కేమాత్రం దగ్గరపడుతున్నామని ఆలోచించేను. ఆలోచిస్తే దేవుడి దగ్గరనుంచి రోజు రోజుకీ దూర మగుతున్నామని తోచింది.

శ—ఇన్నాళ్ళూ ఎప్పుడూ ఈ జ్ఞానం మా వంటి పామరులకు బోధపర్చటం లేదేం?

ఉ—అదిగాక, దేశోద్ధరణ ఒక మూ ల్నుండి, దేశమ్మరమ్మతు మరోమూ ల్నుండి మొదలపెట్టక ఎన్నాళ్ళురా ఇట్టా కూర్చోవడం.

శ—పరీక్షకు పెట్టకుండా నువ్వు దేశోద్ధరణ, దేశ మ్మరమత్తు ఏమిట్రా? ఇంతకు ను వ్వేమయిన పాసయితేనా నలుగురు నిన్ను చూశేది? లేకుంటే నీ కేసి చూశావా డెవడ్రా?

ఉ—ను వ్వింక నీ పెర్సన ల్వేనిటీ, నేషన ల్వేనిటీ లో మెర్జి చెయ్యిక పోవడం చూస్తే మై హార్టు బ్రేక్సు. మొన్న పంజా బ్బెఫైరు చూశీ ఇంకా నిద్ర మీాకు పడుతూందిరా?

శ—నీ డాబుల కేం గాని ఈ వాళ ది పంజాబు ట్రాజడీ మీాద సరోజని ఉపన్యసిస్తుంది వెళదాం పట్టు పద,

ఉ—ది వేర్?

శ—పురమందిరంలో.

ఉ—ది విక్టోరియా టవున్హా ల్యూ మీాన్.

శ—పదవోయి జంతువా.

ఉ—అకస్మాత్తుగా దిగబడింది మనకు తెలియకుండా. నా కింటి మేషనైనా చేసింది కాదేమి చెప్మా? అబ్బాయి! ను వ్వెప్పు డయినా విన్నావా?

శ—ఒకమారు విన్నా. ఓహో ఏమిటరా! ఆ గంగాప్రవాహం ఆ ఇంగ్లీషు, ఆ మెలోడీ.

ఉ—గుంటూారు జంతువకి ఫెమినైన్మెలోడీ కూడా బోధపడిందీ? నీ ఏడ్మిరేషను జూస్తే పంతులుగా రుపన్యసించడం ఎన్నడు చూాళ్ళేదు లాగుంది?

శం—చూడకపోయినా విన్నావ్లేవోయి జంతువా?

ఉ—బై ది బై, యాంటీ స్త్రీవిద్య ప్రచారకుడువికదూ నువ్వు? ఇప్పు డేమి టంటావ్.

శం—సిద్ధాంతాలు తర్వాత జేద్దుగాని లే.

ఉ—లోకమరమ్మ తవాలంటే ఇపుడు చెబుతున్నాను విను. ఎప్పటి కయినా ఆడవాళ్ళైనా అబ్బాయి.

శం—బుద్ధితక్కువ బూతులు పేలబోక! ప్రపంచక చరిత్రలో లోక ప్రవాహాన్ని ఏవిధంగానయిన, ఏ స్త్రీ అయిన మళ్ళించటం నిదర్శనం చూపెట్టగలవ్వూ?

ఉ—మెల్లిగామాటలాడు. ప్రపంచకము స్వయంభువమై ఆరంభ మయినరోజునుండి లోకప్రవాహముయొక్క చలనాన్కి స్త్రీ లే కారణం. స్త్రీ లేకుంటే నీ ప్రపంచకాన్కి జీవం ఏదిరా నాయనా?

శం—స్త్రీలు ఎన్నడయినా పురుషుల నీడనుపట్టి పెరగాల్సిందే. అట్టా అయితేనే పరిమళం, సారస్యం ఉన్నూ. చరిత్రలో నైనా అట్టాంటి స్త్రీలే పేరుపొందారు.

ఉ—నీమాస్క్యులై ప్రిమిటివ్ డెస్పాటిజ మింకా నీబుర్రను వద ల్లేదు. స్త్రీ అంటే పగటివేళ ఇడియటనిన్ని రాత్రివేళ ఏన్జల నిన్ని నీ థియరీ. అంతేనా?......

శం—మిల్టన్......

ఉ—మిల్టన్ మాట చెప్పకు. వాడి రాత మాస్క్యులైన్ నింపర్టి నెన్సుయొక్క హైహ వాట ర్మార్కు.

శం—కైస్ట్రీసేమన్నాడు. జడ్జి యీ ది ట్రీ బై ఇట్సు ఫ్రూటన్నాడు. ప్రస్తుతం మనం హిందూడీజనరేషన్కి మిరిఫార్మ మిాఫీమేలెడ్యుకేషను ఇవే కారణాలు. Home life ని తగలపెట్టింది; వాళ్ళ హెల్తుని పాడుచేసింది; వట్టి ఇమిటేటింగు బొమ్మలగా ఆడుపిల్లలందరిని మార్చింది; కారక్టర్ని వల్లకాట్లో కలిపింది; ఇది ఫీమేలెడ్యుకేషనంటేను. విన్నావా.

ఉ—మాస్క్యులైన్ప్రెజుడిసంటే ఇదేను. విన్నావా? సరే; ప్రస్తుత మా బుల్బుల్ వాక్సంగీతపు విం దారగించడానికి వేళవుతూంది వెళదాం. మరోమారు I shall change your opinion. (నిష్క్ర.)

---

రంగము ౨. — వీధి.

---

[ఇద్దరు విద్యార్థులు - బాటసారి ప్రవేశము.]

బాటసారి—అబ్బాయి! మిా దేవూరు?

1.వి—మా దీ దగ్గర పల్లెటూరు.

బా—ఆ పిల్లకాయదో?

1.వి—వాడిదీని.

బా—ఇక్కడ చదువుకోవటానికి వచ్చేరుగా?

2.వి—మరేం.

బా—ఏ కాలేజీలో చదువుతున్నారూ?

2.వి—ఇక్కడున్న దొక్క కాలేజీయేగా?

బా—మీకు మా పిల్లకాయని తెల్సుగా?

2.వి—మీ పిల్లకాయ పే రేమిటీ?

బా—మా పిల్లకాయపేరు తెలియదటా. మీ రెన్నాళ్ళయిం దిక్కడికి చదువుకోవటాని కొచ్చీ?

2.వి—నాయన! నీపే రేమిటో చెబ్దూ?

బా—నాపే రేదయితే నేం. వల్లకాల్లో రామనాథాయ.

2.వి—సర్స రిప్పుడు తెల్సిందిగా. మీ పిల్లకాయ అట్టా తుమ్మల మెట్టకేసి ఆడుకోటా నెక్కెళ్ళేడు.

1.వి—అదేమిట్రా!

బా—నాయనా మీకు మా ఉమాకాంతాన్నిగూడా తెల్సుగా?

1.వి—ఏ ఉమాకాంతం?

2.వి—ఎవడు? మొన్న నాయుడువీధిలో అల్లరి చేసినవా డేమిట్రా? ఏక్లాసు చదువుతున్నాడు డా ఉమాకాంతం?

బా—అంతమట్టుకు తెలిస్తే మిమ్మల్ని అడగటం ఏం నాయనా?

1.వి—ఎర్రగా పొడుగ్గా ఉంటాడు పువ్వుల రంగళ్ళాగ; రామయ్యగ్రహారం అతనేనా?

బా—ఆ ఆ అతగాడే

2.వి—ఆ జంతువ ఏనా? తెల్సునండి. రత్నమాల ఇంటి కేసివెళ్ళి అడగండి.

బా—రత్నమాల ఎవరండీ? ఆ యిల్లు ఎట కేసండీ?

2.వి—అట్టా తిన్నగా కనిపిస్తూందే లాంతరు, దాని కుడిచేతి కేసి తిరగ్గానే ఎడంచేతి కేసి సందులో మొదటి గుమ్మాంకి ఈ చేతి కేసి ఉన్న పెద్ద మేడ కెదురుగా సందుంటుంది. అందులో మొదటి మేడేనండి.

బా—నాయనా. ఈ రోజున దొరికినట్టే వుంది. చుట్టుపట్ల ఏమయినా సత్రవైనా పూటకూ ళ్ళిల్లయినా ఉందా?

2.వి—నే చెప్పింది సత్తరవేను.

1.వి—లేదురోయది పూటకూ ళ్ళిల్లు.

2.వి—రెండూ కలిసి వ్దయి తేను. హోటేలు కావలిస్తే అదిగో ఆ మూడో గుమ్మంకి ముందరి సందులో మొదటింటిమీద అలెగ్జాండ్రా అని ఇంగ్లీషుని రా సుంటుంది. అందులో కెల్లండి.

బా—నాయనా వెళ్తాను. మీకు శ్రమ ఇచ్చేను.

2.వి—మహాసంతోషం. దండంపెట్టి సెలవు తీసుకోండి.

బా—మా కేసి దండంతో కొట్టట మేకాని పెట్టటం అలవాటు లే.

2.వి—మా కేసి అలవాటులు వేరుకదండీ? మేము దండం పెడ తామండి. మీవాడ్ని కలుసుకోండి చెబ్తా డంతా.

బా—ఉద్దండపిండం లాగున్నావూ?

2.వి—పులిమీద పుట్రన్నట్టు దండంమీద ఉద్దండం ఒకటి వచ్చిందీ? నాయినా మీరు పని తొందరమీద నున్నవాళ్లు. మే మంటే అంతకన్నా పని తొందరమీద నున్నవాళ్ళం. మీరు మీ వాళ్లని వెతుక్కోవడానికొచ్చినట్టుంది; మాకు మావాళ్ళు దొరికినట్టుంది. అంచేత మీది దక్షిణ కోస్తా. మాది ఉత్తర కోస్తా. మీరు మీరు, మేము మేము; మరి మీకు మాకు కలియదు. కావున ఓ యుద్దండపిండదండ ధర్మాగ్రేసరా! పూజ్యులు మీరు. కుశాగ్రబుద్ధిగలవారలు; నాకలోకవాసులు; కేవలం వామనులు; రుద్రులు; వంగి నమస్కరించి సెలవు గైకొండు.

బా—సెలవు పుచ్చుకోక మీ ముందు నిలవగలనా?

2.వి—శుభస్య శీఘ్రం అన్నా డందుచేతనే.

(బాటసారి నిష్క్రమించును.)

ఒరే ఆ ఉమాకాంతాంక్ చుట్టం కాబోలు వీడు. మొన్న నాయుడువీధిలో అయిన ముచ్చట విన్నావా వాణ్ణిగురించి?

1.వి—ముచ్చట కేముంది? ఎవరికో సంగీతం చెప్పడానికి ఒప్పుకున్నాడట.

2.వి—సంగీతం ఎవరికి చెప్పడానికి? జఫాటాలాంటి దో నాయుడు గుంట ఉన్ది అక్కడ. నానాసంకలు నాకి ఎలాగయితేనేం కుదురుకున్నాడు; కుదురుకుని మొదలుపెట్టేడు. మొదలుపెట్టి

పదిహేనఃరోజు లయినట్టుంది. తప్పు జెప్పేను. మొదలుపెట్టిన తరువాతే కుదురుకున్నాడు. మీ ధంతా గుప్పుమంది. అంటే మీ డేం జేశేడూ? పటే ల్సిబ్లని లెక్చర్ల్ని కొట్టడ మారంభించేడు.

1.వి—నీ కెవడు చెప్పేడ్రా? నాకు తెలియనే లేదు.

2.వి—అయి సం జ్ఞో అయి సన్నాడు. ఎందు కా కళ్ళుండి? ఇంకా చెబ్తా విను.

1.వి—అల్లా వస్తున్నవాడు వాడేనా ఏమిటిరోయి?

2.వి—చచ్చీవరకు వీడికి పూర్ణాయ ష్యుంటుంది మన శాస్త్రాలే నిజమయితే. వాడు వెళ్ళిపోనీ చెబతా.

(ఉమాకాంతం చేతికర్ర ఊపుకొనుచు ఆ తోవంట వెళ్ళును.)

వాడి మొహం చూశావా? ఓ ఏం విసురుబాటు; ఏం నడక; గుండెలు ముందుకు తోసికొని, మెడలు విరిచికొని, ఆ చేతికర్ర లేకపోతే నేమిటో, దాన్ని బాణాకర్ర తిప్పుతూ! ఆ కళ్ళు ఆ యింటి గుమ్మంలోకి ఈ యింటి గుమ్మంలోకి పారేస్తూ, రోడ్డుమీదాగ్రాపింగు దిద్దుకోకపోతే నేమిటో-చూడు చూడు. వీధిలో ఉన్న మనలాంటి వాళ్ళ కగపడాలని ఆ పట్టు చేతిరుమాలు విసురు. చూశావా వాడి మొహం. ఆల్లేదు చూల్లేదు కొడుకుపేరు సోమలింగం అని, అది దాన్ద బ్బా ఉందికదా అని చెప్పి చదువు ఎత్తిగట్టేశేడు. కాలేజీ

మానేశేడు. ఇదిగో ఇలాగే వీధులంట బడ్డాడు. ఇప్పుడూ ఈ సంగతంతా వాడి తండ్రికి తెలిసిందిట; ముసలాడు ఛండశాసనుడు.

1.వి—ఆవేపు వెళ్తున్నాడు చూడు.

2.వి—ఇంకా చెబ్తా విను. ఇప్పుడా వీధిలో కెత్తే కాళ్ళు విరగ్గొడ్తానని దాన్తండ్రి కూర్చొన్నాడు. ఈ చవట కింకా ఆ సంగతి తెలియలేదులాగుంది. అటు జూస్తే వాడితండ్రి ఇంట్లో కొస్తే కాళ్ళు విరగ్గొడ్తానంటున్నా డక్కడ. వీ డిక్కడ జూస్తే అప్పుల్లో మునిగి ఉన్నాడు. పద; మనంకూడ వాడి వెనకనే వెళదాం. (నిష్క్ర)

---

## రంగము. ౩

[శంకరశాస్త్రి, రంగాచారి, క్లబ్బు మేనేజరు.]

మే—ఏమండి శాస్త్రిగారూ! ఉమాకాంతంగారు చదువు మానేశే రట.

శం—నీకు తెలిసిందీ? మానీశేడు.

మే—ఊరికి వెళ్ళిపోయే రేమిటండీ? నిన్నట్నుంచి కనబడ లేదు.

శం—లేదు లేదయ్యా, మాతో చెప్పకుంటా ఎక్కడికి వెళ్లటంన్నూ, పోవటమున్నూ?

మే—మరేం లేదండి; కిందటి నెలతాలూకు ఎకౌంటు ఇంకా సరిచూసుకోలేదు.

శం—ఎంతమాట అట్టా అంటావా?

మే—క్షమించండి శాస్త్రుల్లుగారూ. ఊరికి వెళిపోతే మళ్లీ ఎప్పుడో అని అన్నాను.

శం—నీ కెంత ఇవ్వాల్సింది?

మే—సుమారు నూ రండి.

శం—పోయి న్నెల కేనా?

మే—అవునండి.

శం—నే చెబ్తాగా. కబురు పంపిస్తా.

మే—చిత్తం సెలవు.

శం—హా ర్వీడి దుంపా తెగా!ఒహ నూరు పద్దు పెట్టీ డీజంతువా?

[నరసింహం ప్రవేశించును.]

న—శాస్త్రీ ఉమాకాంతంగానే ఇక్కడి కొచ్చేడా ఈవాళ?

శం—ఏ మంతపని?

న—ఏమి లేదు. విల్సన్లోనుంచి ఏదో పద్దొచ్చింది. తంటసంలాగ తగులుకున్నాడు.

శం—ఏమాత్రం?

న—జోరుగానే! నూట ఏభై పైమాట.

శం—అయి బాబోయ్! వీడి కింతమట్టుకు ఎట్టా పెరిగిందిరా ఎక్కౌంటూ? దగ్గర ఏమయినా ఉందా?

వ—నా కేం నమ్మకం లేదు.

[ఉమాకాంతం ప్రవేశించును.]

ఏమిరోయి ఎక్కడా గుండేసినా జాళ్ళేదు? నీ మొహం ఈడ్చా ఈ బి ల్లేమిట్రా?

ఉ—హెప్పుడు పంపించాడు?

శ—అదట్టా ఉణ్ణీరా, నీదుంపా తెగా, క్లబ్బు కెంత ఇవ్వాల్సిందిరా నువ్వూ? మేనేజరు నాతో చెప్పేడూ.

ఉ—ఎంతంటాడు?

శం—ఒక వందట.

ఉ—దీని కేనా ఇం తాశ్చర్యం? నా పే ర్నో డివిడెండుంది. ఇండా ర్సుచేసి పా రేస్తా. ఇదా మీాకు టాపిక్కు దొరికింది; న్యూ సేమిటి?

క—పేపరు విప్పు.

[బంట్రోతు ప్రవేశించును.]

బం—దండం అండి బాబూ.

ఉ—ఏ మిలా గొచ్చేవు?

బం—బిల్లు పట్టుకొచ్చేనండి?

శ—ఇక్కడికా?

బం—సిత్తం.

ఉ—ను వ్వెన్నాళ్ళయింది విల్సన్లోనుండి? వాళ్ళ బంట్రోతు లిలాం

టి అమర్యాదా పనులు చెయ్యరే. ఇంటికి పట్టుకొస్తావా, ఇక్కడికా? ఆ

బం—చమించండి. ఇంటికాడ కొచ్చేనండి; మీా ర్నేకపోతే, ఆ అయ్య ఇక్కడికి-

ఉ—ఆ అయ్యకీ బుద్ధిలేదు. నీకూ బుద్ధిలేదు. పో హ్హో.

బం—బాగుందండోయి. ఏటో కబురు సెప్పండి.

ఉ—వే జ్లెవుల... నీకు నాకు కబు ర్లేమిట్రా; పోహ్హో.

బం—డబ్బయినా సరే, మిమ్మల్న యినా సరే. దొర తీసు కొని___

ఉ—డబ్బేమి? డబ్బున్నర తీసుకుపో. (డబ్బున్నర-అర్ధణా పడవేసి) మరి పో.

బ—హీ దేటండి.

ఉ—నువ్వడిగిం దిచ్చినా పోవేం?

బం—కంపినీ కిచ్చేదో?

ఉ—వెఱ్ఱిముండా కొడకా, కంపెనీ ఊసు నీ కెందుకురా? నువ్వీ అర్ధరూపాయ పట్టుకుని పారిపో! మరి మాట్లాడకు, నే కనబల్లే దని చెప్పు. పో.

బ—ఓ కాయితం మీాద ఆ మాట రాసివ్వండి.

ఉ—ఆలాగ వ్రాయమన్నావు? నీకు మతి వుందా లేదా? పోహ్హో.

బం—సిత్తం అండి.

(నిష్క్ర-)

నర—ఒదుల్తా డనుకో లేదురా నేను.

ఉ—మీా కేం డిప్లొమసీ చేతనయితేనా? సింహాం అంతటి సింహా న్ని కాబట్టి పోయేడు కాని, వాడు సాధారణంగా ఒదుల్తాడూ? ...పోలిటిక్సు మరీ పాడయేయిరా ఇప్పుడు. తిట్టుకోవడం తప్ప మరే వల్లకాదూ లేదు. మన రాజా మెంబరు చూశా వా ఏమని రాశాడో?

శం—ఏ మంటాడు?

ఉ—బ్రాహ్మర్లు పనికిరారట మంత్రాంగంలో ఉండడానికే.

శం—మీాసా ల్దిప్పటం. ఎక్కడికి వెళ్ళీనా హుక్కా పట్టుకొని తిరగడం, అనుకున్నాడు కాబోలును దద్దయ్య? వాళ్లేడుపు కేం గాని మన దేశస్థితి ఎంత దుఃఖభాజనమై పోయింది! ఆధునిక నాగరీకతా ఫలమో, గాక భారతీయుల ప్రత్యేక భాగ్యమో కద!

ఉ—నీవు, శాస్త్రీ! మహాంతమైన ఆర్టిస్టువి సుమా; రెండుమాట లతో నన్ను ఇమోషన్లో ముంచేశేవు. విను.

వ్యాధుల నెచ్చించు • వైద్యాలయంబులు
కనివిని యెరుగని • గతులజూప
కరవుల నెచ్చించు • మరలు ప్రజలనన్న
మో రామచంద్ర! యం•చార్తి బెట్ట
కపటములన్నేర్పి • కలహాల కల్పించు
కోర్టులాత్మల గూడ • కుళ్లు బరుప

సర్వేంద్రియంబుల • దౌర్బల్య మొనరించు
విద్యావిధానము • వింతగరుప
ఐహికాముష్మికమ్ము • నన్ని వదలి
రెంటికి చెడిన రేవడ • లౌట జూడ
ఆధునికనాగరీకతా • ఫలమొ గాక
భారతీయుల ప్రత్యేక • భాగ్యమొకద॥

శాస్త్రి!

వేదాల మానేరు • వాదాలు పడ్డారు
లౌక్యానచెడి బ్రాహ్మ • లంతమంది
శౌర్యాల వదిలేరు • సానులమరిగేరు
రాజ్యాల వీడుచు • రాజులెల్ల
వదిలేరు వాణిజ్య • మాశలపెంచేరు
మద్యపానాసక్తి • వైశ్యులెల్ల
అప్పులు పాలయే • రాతల్లి మరిచేరు
శుచియగు కృషివీడి • శూద్రులెల్ల
జాతిధర్మముల వదలి • జాడ్యబుద్ధు
లగుచు అపర దిగ్మోహితు • లగుచునుంట,
ఆధునిక నాగరీకతా • ఫలమొ గాక
భారతీయుల ప్రత్యేక • భాగ్యమొకద॥

—ఏమిట్రోయి, ఆనంద భాష్పాలు వచ్చీలాగ...

న—శాస్త్రీ! ఎంత తెల్వైనవాడివి! ఆశువని డంగు బజాయించి పోయే వేమిటి? మొన్న సంవత్సరాది సంచికకు కూర్చొని రాశినవిరా- ఏమిరా ఉమాకాంతం

ఉ—అదునుజూచి మరి ఆస్యమాడు.

రం—ఇంతేకాదబ్బా;మన దేశం మరోవిధమయిన పెద్దమనుష్యుల వల్ల చెడిందబ్బా. ఉమాకాంతం ఏమనుకోకపోతే చెబ్తాను.

ఉ—కానీ

రం—వర్ణ సంకరమైన • పూర్ణ స్వరాజ్య స
మస్య సాధించితి • మనెడువారు
పాడియా పద్ధతి • పాశ్చాత్యులట్టుల
స్త్రీలపెంచుటయే గతియనువారు
ఉద్యోగములు మన • కున్న స్వరాజ్య సం
సిద్ధి వేగమగునం • చెంచువారు
ఆంగ్లుల నందర • నావతలకు పార
తరిమిన నిక యే గతనెడువారు
ఇట్టు లీ పుత్రులెల్ల వా • గ్వివరయుద్ధ
తీవ్రమతులౌచు, శూన్యబు • ద్ధీంద్రు లగుట
ఆధునిక నాగరీకతా • ఫలమొగాక
భారతీయుల ప్రత్యేక • భాగ్యమొకద॥

న—రంగాచారీ! ఇన్నాళ్ళకి సార్థకంలో తెచ్చేవురా నీ కవిత్వపు శక్తి. ఉమాకాంతం మాడ్చేడ్రా శాస్త్రి.

శా—అందుకు సందేహం ఏమిటి?

రం—ఇంతేకాదు. ఇంకా వినండబ్బా,

చక్కని సంస్కృత • ముఖకాంతు లక్కటా
పశ్చిమ మంచుల • మాసిపోయె
శృత్యాదులెల్లను • పత్యాహారులయి మ
నోంధముల పథము • గోలుపోయె
మూలనున్నముసలి • మోముల విసరంగ
బట్లేరు లింగ్లీసు • నటనమాయె

శా—వహావ్వా రంగా.

రం—దొరజాతి భూషణ • దోషము లెన్నుటే
పావన సంకీర్తన • పథమాయె
పోయిన దదేల రానున్న • ముందుగతుల
నైన పరికింప జడ్డులై • యరుగుచుంట
ఆధునిక నాగరీకతా • ఫలమొగాక
భారతీయుల ప్రత్యేక • భాగ్యమొ కద॥

ఉ—తెలివి తక్కువ ఆకలి ఎక్కువ రంగడికి. దేశంఅంతా దుర్భర సంక్షోభంలో మునిగిపోతూంటే ఈ వెర్రివెకాసా లేమిట్రా? ఎన్నాళ్ళుశాస్త్రీ ఈ నిద్ర?

ప్రాచీనబుద్ధి ప్ర • భా కాంతి చయమైన
నయనపథముల జూ • పంగ లేదు

పరదేశ నిర్గత • భావాగ్నిధార

చయమయిన మేల్కొలు • పంగలేదు

కాలమార్తాండ ప్ర • కాశోజ్వల మహాత్మ

లక్లేశమైన • లేపంగలేదు

ఘోరరక్తసిక్త • వార ప్రవాహమా

సింధు రోదనమైన • లేపలేదు

అక్కటా నాత్మయు నోడలు • మరచిపోయి

కుంభకర్ణుడే లనిపించు • మాయనిద్ర

ఆధునిక నాగరీకతా • ఫలమొగాక

భారతీయుల ప్రత్యేక • భాగ్యమొకద॥

న—అమ్మనాయనా? మీా ఘర్జనల నిలవలేక మూడురోజులు కూర్చొని నేనో పద్యం రాసేను. వింటారేమిటి?

ఉ—ననతోగూడిన నారకు గూడ సువాసన అబ్బును అన్నట్లు పంతులుగారితో కూడికచేత నరసింహాంకి గూడ కవిత్వం అలవడ్డట్టుంది. ఏది నాయనా వినుపించు.

వ—ఎవ్వరు సంతోషిం • చెదరన్న ఎవరితో

డను నాకు పనియేమి • టనుచు నవ్వ

పదలాలిత్య మ్మగ • పడదన్న నీపద

ములయిన నేమి చా • లోయియనును

భావము లేదన్న • పలుకాడకను యేదో

ముభావంబుగ • నూరకొనును

ఇదియేర అర్థమే • లేదన్న టాగూరు

నెన్నడయిన చది • వేవ యనును

శా—ఉమాకాంతం. కాన న్టది రైట్, కాన న్టది లెఫ్ట్.

న—అబ్బా, వినరా.

గణ యతి జ్ఞానమేమి • యగపడ దనిన

పాతతోవలన్నియు పాడు • పథము లనును

అన్నివిధముల గొప్పవా • డైనవాడు

కలడు మావా డొకడు • కవసాల యముఁడు॥

శా—వహావ్వా. ఫ్రెంచి ఏకాడిమీలాంటి దొకటి మనము స్థాపించాలి.

ఉ—ఆంధ్రపరిషత్తుని అమాంతంగా మింగివేయాలి.

శా—ఈ మాసం పరిషత్పత్రిక చూశావా?

ఉ—ఏ మంత చదవ్వాలసింది.

శం—పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడికట ముందఁ ప స్ననసలు పుట్టుతోనే లేదట.

ఉ—ఎందు కొచ్చిం దా సంగతి?

శం—లేకపోవడం వల్లనే దుష్యంతుడు శాకుంతలిని ముద్దు పెట్టుకొనేటప్పుడు రాసిన వర్ణన సహజంగా లేదట.

నర—ఛైబాష్ ఏదో సూరకవిని గురించి ఉం దన్నావు.

శ—ఉంది. మొదటి వాదంసూరకవి చిత్తూరు వాడని, రెండోది చెరువులో నించొని పద్యాలు చెప్పేడంటారే ఆ పద్యాలు

నిజంగా ఆశువుగా చెప్పలేదని రామావధాని వాదం. ఆ వాదానికి వీళ్లు అయ్యపిళ్ళ డైరీలోనుంచి, ఇంకా ఎవళ్లో మిషనరీ డైరీలోనుంచి ప్రతివాదం దీసుకొనివచ్చి సిద్ధాంతరీకరించేరు.

ఉ—మనవాళ్ళ విమర్శనశక్తి బాగా ఉపయోగంలోనికి తెచ్చేరు. నా డేకశిలానగరం మీద ఎంత పాండిత్యం ప్రయోగించేరో నేడు మళ్ళీ సేతువు మీదఅంతా వాదుల్తున్నారు. ఇంకా.

శం—ముఖ్యమయిన విషయం ఆజీమ్యాన్‌రసూల్ మహమ్మదుత్తరాల్లో ఒకవుత్తరం దొరికిందట. అందులో నన్నయభట్టు అసలు నియోగికాడు వైదీకికాడు, ఆ సాయబు కింద సేనానిగా ఉండే భట్రాజు అని తేలిందట. వ్రాతప్రతిమాత్రం చదువుకు నేలందుకువీలుగా లేదట. ఇప్పటికాలంలో ఇంత ముఖ్యమయిన విషయం ఇదివరకు బయలుపడలేదని ఆంధ్రపత్రిక అభిప్రాయం ఇచ్చింది. జస్టిస్ పేపరు వాళ్లు ఈ విషయం ఇంగ్లీషులో రివ్యూచేస్తూ, కవిత్వచక్రం బ్రాహ్మర్లు మేమే తిప్పేమని కొట్టేడాబులన్నీ నేటితో నిర్మూలమై భూమట్టమై పోవలసిందే అని మహత్త్రవ్యాసం వొకటి యెడిటోరియల్లో రాశేరు.

ఉ—ఇంకేమిటి?

శం—మరే వచ్చి భాషాతత్త్వ శాస్త్రివాదులు అరవ్వాళ్లు!

ఆంధ్రులికి గల ప్రాచీన బాంధవ్యం గురించి మహా పాండితితో గూడుకొన్న వ్యాసం వొకటి.......

ఉ—అరవ్వాళ్ళా. వాళ్ళకి మనకి సంబంధమా. డాం నాన్సెన్సు. మనం పరమ పవిత్రమైన ఆర్యులం; వాళ్ళో, పద్యరూపంగా చెప్తాను.

లంకాపతి జంపుటకై
గొంకేనియు లే కరిగిన • కోతి ఘనులతో
లంకావీరుల విధవలు
రంకాడగ బుట్టినారు • రా యీ యరవల్॥

శం—బుద్ధి వైశాల్యం లేదురా నీకు.

ఉ— క॥ కాదంటివేని చెప్పర
......ముఖములు కంపు • కొట్టెడు శిఖలున్
గేదంటి శరీరంబులు
పోదంటి పలుకుల నాడు • సొంపు లెచటివో॥

నర—మళ్ళీ ఆశు కవిత్వమా ఏమిటి!

శం—పరిషత్పత్రికా సంపాదకులుకొంత రిసర్చివర్కు చేసేరు.

ఉ—దేనిమీా దేమిటి?

శం—అర్జున సంభోగలభ్యులైన స్త్రీలయొక్క తేదీవారి జన్మస్థానాది వివరములు.

(అందరును గొల్లుమని నవ్వుదురు.)

ఉ—ఇది అన్నిటికన్నా ది గ్రాండెస్టు.

న—ఇ దంతా వెస్టర్న్ క్రేజు సుమండీ.

ఉ—లేకుంటే మనచవట్లు ఇంతకన్న బుద్ధిమంతులనా ఏమిట్రా నీ యభిప్రాయం.

శం—మరి దీని మీాద ఒపినియన్ వినండి.

ఉ—ఎవరిది?

శం—వీరేశలింగం గారిది.

ఉ—ఏ దేద్చదు వీ ముసలి రసికుడు ఏ మంటాడో?

శం—"వాఙ్మయ మహాసముద్రమున జేరు నదు లన్నింటిని పరిశోధించితిని గాని ఇయ్యది యొక్కటియే మిగులు వడెను. స్వీయచరిత్రమందు దిగబడి నే నుంచిన ఈ లోటును అనిర్వాచ్యముగ తీర్చిన పరిషత్తు వారలు ఆంధ్రవాణి నుద్ధరించిరని నా నమ్మకము."

ఉ—బలే! అబ్బీ 'On the Telugu Critics' అని ఒక ఉపన్యాసం రాద్దునా?

శం—ఇంకా విను. "ఆంధ్రులు ఆంధ్రులుగారు; తెలుగు తెలుగు కాదు" అని శ్రీమతి చేమర్తి వెంకట సుందరమ్మగారు వ్యాసము.

ఉ—సుందరమ్మ సుందరమ్మగాదు. కురూపమ్మ అని నేరాస్తాను. ఏమిట్రా ఈ నాన్సెన్సు?

[మేనేజరు ప్రవేశించును.]

మే—ఏమండో ఉమాకాంతంగారూ! ఊరికి వెళ్ళిపోయే రను

కున్నాను.

ఉ—ను వ్వనుకుంటావు. డబ్బుకోసమేనా నీ ఏడుపు?

మే—ఏడుపు కాదు: అవసరం వచ్చింది.

ఉ—ను వ్వవసరా ల్రావని తెల్సును నాకు. నీకు భయంగా ఉంటే స్టాంపు కొని పట్రా, నోటు రాసి ఇస్తా.

మే—కాగితం ఏ చేసుకోనండీ?

ఉ—పకోడీల పొట్లాం గట్టి నాకు పట్టుకురా. సాయంత్రం ఇస్తా నంటే బోధపళ్ళేదూ? ఏ దేది మా మంచి తమ్మోట్లు చేయించేవు, మరి నా డ బ్బెందుకు? ఎం తిచ్చి చేయించేవు?

మే—తక్కువలోనే అండి.

ఉ—రాత్రి సినీమాకి వెళదాం వస్తావా?

మే—మీరు మహారాజులు.

ఉ—మ రామాటమీదే ఉండు. ఈ డివిడెండు చూశావా? నీ కిండార్సు చేస్తా రేపు. పో ఇప్పుడు.

మే—మీ రూరికి ఎప్పుడు వెళ్ళిపోతారు?

ఉ—నే నెక్కడికి వెళతాను వల్లకాట్లోకి.

మే—నా డబ్బు కేమిటం డంత కోపం.

ఉ—అన్నా ఏమిటీ అంబాజీపేట? ఈ చేతికర్ర కావాలీ నీకు?

మే—కర్రముక్కతో ఏం చేసికోనేది?

ఉ—పుట్టిన బుద్ధి పుడకల్తో కాని పోదట.

మే—మ రయితే—

ఉ—నువ్వు బుద్ధిమంతుడివి. భారతామ్నాయ మంతా బైహార్టు పెట్టినవాడివి; పేరు ప్రతిష్ఠ బడ్డ సంసారివి; చుట్టుపక్కల నీ అంత మర్యాదస్థుడు నభూతో నభవిష్య తని పేరుపడ్డ వాడివి; వాతావరణం శీతోష్ణస్థితులు సరిగ గమనించడం మానివేసి నీకు సహజమైన మర్యాదాలు ఒదిలిపెడతావని నే నెప్పుడు అనుకోలేదు. నీతో పరమరహస్యమైన వొక విషయం మాట్లాడాలి; వింటావా?

మే—చెప్పండి.

ఉ—నలుగురిలోనే!

శం—ఏటావత లల్ల రేమిట్రా అంటే అరవలు ఏకాంతం చెప్పు కుంటున్నారని అన్నట్టు

ఉ—బుద్ధివైశాల్యం లేదురా నీకు. అది వేరేకథ. ఊ. అన్నట్టు

శం—నీ కాకలి ఎచ్చవుతూం దేమిట్రా

ఉ—మేనేజరు మొహం ఎదురుగా ఉంటే నా కాకలి వెయ్యనే వెయ్యదు.

శం—మేనేజర్! నే చెప్పిన మాట విను. రే పొద్దున్న పైసలు చేసుకుందాం. ఇప్పటికి వెళ్ళు.

మే—ఏమో నండి.

శం—ఎమో నే చెబ్తా. (మే. నిష్క్రమించును) ఉ మాకాంతం

మే—రేపు నీసంగతి ఇటో అటో—

ఉ—ఇందుకే బివే రాఘ్రైం డ్సన్నాడు.

(తెరదిగును.)

# నవజీవనము.

## అంకము ఐదు

### రంగము ౧

[ఉమాకాంతం గృహం]

ఉ——వ్యవహారం ఇప్పుడేలాగుంది కొంచెం తర్కించి చూస్తే? ఒకటి, మా నాన్న డబ్బు పంపించడం మానీసేడు, మనుష్యుల్ని కట్టేడు నా కోసమని; రెండు, పంతులుగారికి క్రెడిటు తక్కువ ఎక్కౌంటు ఎక్కువ అవుతుంది; మూడు, ఓ టపాకాయ చీదీసింది. నాలుగూ, డిగ్రీ సంకనాకి పోయింది. అయిదో దిటుపైని చూడాలి; చూడడాని కేముంది? నా ధనలక్ష్మి, నా ప్రాణాన్కి ప్రాణం ఇక్కడ ఉంటేను ఒక్క నిమిషంలో క్రెడిటు లేవతియ్యనూ?

ఆవుర్కి మోటారుమీదేకదా వెళ్ళడం. మోటారుమీద వెళితే మన్ని చూసి మతాబా కాల్వనివాడుండడు. హాయిగా ఆరమ్యహర్మ్యం ఆక్రమించడం, ఇంట్లో నౌకర్లు వాకిట్లో జమానులు; వీళ్ళకి ఒక నెలవరకు లోటులేదుగద. రామ కుమా

రెన్నడయిన ఆ మేడ షోకులు, ఆ దీపాల షోకులు, ఆ వైభ
వాలు వాటి నెన్నడయిన ఎరుగుంటేనా? ఇక నవి థియేట
ర్లకి వెళ్ళడాలు కావు, ఇక నవి సినిమా బాక్సులో కూర్చో
వడాలు కావు. పెర్లు వైటు బొమ్మలు, ఆ ఏక్షన్లు ఆలబులు
కూర్చొని ఫిల్ము చూపిస్తూన్నప్పుడు ఆ చీకటిలో నా సందె
డునిండా నా ప్రాణేశ్వరిని బెట్టుకొని దానికి అవి బోధపర్చ
డాలు కావు. ఇంటర్వెల్లో ఎవర్రా ఈ దేదీప్యమానమైన
భార్యా భర్తలు అని థియేటర్లో ఉన్నవాళ్ళంతా వెనుకకు
బుర్రలు తిప్పి మావేపు అవి చూడ్డాలు గావు. వాళ్ళు
చూస్తూ ఉంటే మేము చూపించే ఠీవే రాజ ఠీవి.

ఆ సమయములో మేనేజరు వెనుకనుండి వచ్చి, సార్
అయి సో ప్యూ హొ వెన్జోయి డ్ది ఫిల్ము; వి ల్యూబి ప్లీజ
టు స్టే ఫ ర్సమ్ మై మోౄర్; ష లయి ఆర్డ రే కపు లాఫ్
కూ ల్డ్రిన్క్సని అడిగితే లేత మామిడిపూవులాంటి చిరు
నవ్వుతో నో; థాంక్సని జవాబిస్తే నా రామకుమారి తళ్కు
తళ్కు మని థియేటరంతకి కాంతులు కురిపిస్తూ యుంటే
అప్పుడుగదా వైభవం. ఇంటినుండి కదలాలంటే మోటారు;
ఇంటికి వెళ్ళాలంటే మోటారు. ప్లెజ రంటు అజ్జ్; డ స్టంటు
ది ప్లెబియన్సు.

[బంట్రోతు ప్రవేశించును]

బం—బాబూ! ఉమాకాంతం పంతులుగో రంట ఉన్నారండీ?

ఉ—ఓరి గాడిదకొడకా! నా యింట్లో కొచ్చి నన్ను పోల్చుకో లేవట్రా?

బం—మీా రేనాండి. జాతోర్లాగున్నారండి.

ఉ—నిజంగా? అయితే డబ్బు వృథాకాలేదన్నమాట. నువ్వొచ్చిన పనేమిటి?

బం—రామినాయుడు కొమార్తె ఇదు గీ యుత్తరం మీా కిమ్మండండి.

ఉ—ఏదీ. (ఉత్తరం పుచ్చుకొని) చెబాష్. నువ్వీ రూపాయియినాం తీసుకపో.

బం—దండం బాబు; చెలవు; దరమ్మం అంటే ఎప్పుడైనా బాబుగార్లదేనండి. చెలవు. (నిష్క్రి)

ఉ—ఏం ఉద్దేశం? (చదివి) ఇదేమి టీ దారుణం; అది రాసిందేనా ఈ వుత్తరం? ఈ దస్తూరీ ఈ సంతకం రాముక్కమారిదే. నాకు రాసిన్దేనా? అరే రాముక్కమారి నాకు రాసిన ఉత్తరం ఏమిటి, ఇలాగ ఉండడ మేమిటి? "పెళ్ళి పొసగదు" పెంకిపిల్లలా గుందిగాని కాగితంతో గాబరా పెడదామనే; మోటార్కి బయానా ఇచ్చి, అక్కడింటికి ఎడ్వాన్సిచ్చి; ఇంకా నా ఎలార్మ క్లాకు దానగ్గరే ఉంది. ఇన్ని చేస్తే ఈ ఉత్తరం ఏమిటి? నా రాముక్కమారివి, నా జీవితేశ్వరివి, నీకూ నాకూ కలియదటా? "త్రికరణశుద్ధిగ నా అభిప్రాయ మిది." ఈ కొత్త అభిప్రాయం ఇంత అకస్మాతుగ ఎక్కడ దాపరిం

చింది నీకు? "మీరు తలకు తగని స్వాతంత్ర్యము పూనికొనితిరి
రని నేను నమ్మవలసివచ్చెను. నేడే మీ తండ్రిగారి కడనుండి
మా నాన్నకు ఉత్తరము ఒకటి వచ్చినది. మిమ్ములను అగ్ర
హారస్థు లందరును ఏకమై కులమునుండి వెలివేసిరట. ఈ
సంగతి అంతా మా నాన్నకు తెలిసిన దగ్గరనుండి నన్ను మి
మ్మల్ని కలిపి మింగివేద్దామన్న కోపావేశంతో ఉన్నాడు. నన్ను
గొడ్డును కొట్టినట్టుకొట్టి నా కన్యత్వమునకు ఏమీ లోటు
రాలేదని ప్రమాణము చేయించికొని ఈ ధాన్యపు కొట్టులో
పెట్టి తాళంవేసినాడు. ఈ ఉత్తరము వ్రాయుటకే బ్రహ్మాండ
మయినది. వెంటనే మా బావగారికి కూడ వివాహలగ్నము
కుదర్చవలసినదని తంతి ఇచ్చినాడు. నేడు ఈ యుత్తరము
వ్రాయుటకు బాగా ఆలోచించితిని. త్రికరణశుద్ధిగ నా యభి
ప్రాయ మిది. మొదట ప్రధానమైనపుడే మా బావగారికి
భార్య నైతి ననియు, అట్టి సందర్భమునందు సంఘుసంస్కర
ణము పేర వేరే వివాహము నాలోచించుట నరకకారణ
మని నా యూహ. మనసున కల్గిన కల్మషమునకు ఈ ధాన్యపు
పిట్టల మధ్యను ప్రాయశ్చిత్తము పొందుచున్నాను. మీ కిదే
కడసారి నమస్కారము"...హా ర్దీ నిల్లు బంగారం గాను!
ఇదంతా కల గాదు కదా?...ఏమిటీ చెమట వుపద్రం? షా
కహ్ నాక్. ఈ ఘటా న్కేం రాసిపెట్టేడో? ఇదంతా నా
ప్రారబ్ధం, నా ఖర్మం, నా పాపం అన్నూ. ఆ చక్కని చుక్క

ననవలసిన పన్లేదు. ఈ కాగితం ఏనా నాకు మిగిలింది; ఈ సందెటిలో జేర్చి అనుభవించడానికి? ముత్యాలకోవలులాంటి ఈ అక్షరపంక్తులేనా చూసి సంతోషించడాన్కి, చదివి సంతోషించడానికి మిగిలేయి? ఒక్కమారయినా ఆ మొహం చూడ్డాన్కి నోచుకోలేదూ...... ఓ మనసా! గట్టిపడు. ఈ పాపినీ నిర్భాగ్యుణ్ణి జూస్తే జాలిలేదు? కనికరించి రెండు కన్నీళ్లు తెచ్చుకోవూ? ఈ నిమిషంవర కయినా కథంతా ఒక్కమారుగా మరిచిపో. నా హృదయంమీద రాసిన రాత లన్నిటిని ఒక్కమారుగా చెరిపివేయి. తత్క్షణం...హుష్. నా అవస్థ రాయడానికియే కవియైనా...ఇంకారాయడ మెందుకు; ఊరంతా ముట్టుకుపోతే? అయితే ఈ జీవుడి కింతేనా? బతికే తోవలేదూ? చూస్తూ మతిపోదుగదా? కర్మగాడి చేతికి నా పిలక నందిచ్చేసి, నీకు శ్రీ విల్లిచ్చేనని నీడాబు లేమిటోయి? జరగబోయే సంగతుల్ని పూర్తిగా నీ ఆజ్ఞకు లోబర్చుకొన వైతివి. నీ వెక్కడి బ్రహ్మవు? నీవెక్కడి దేవుడవు? రామ్ముమారీ! రామ్ముమారీ! నీ పలుకులు అతి లలితము లైనవి గదా. నీ నడకలు హంసనడకలుగదా. నీ సాంగత్యము బ్రహ్మా కానందముగదా...ఆహా! మళ్ళా దానిసంగతేనా? హృదయమా! పాతకథలజరగలేదని ప్రణవయామం జేతునా?

....................

సరే నా రత్నం లేదూ. నా ఉలూచి, నా సుభద్ర నా పార్వతి నా రత్నమాల ఉన్నది కదూ. ఇంతవరకు చేసిన తప్పంతా భోడ్డం బాలని బతిమాలు కుంటాను. వీళ్ళకు లొంగుతాడూ ఉమాకాంతం? నన్ను కులంలోనుంచి వెలే సేరేం? ఏం చేసేనని, నేనే వాళ్ళందర్ని ఈ క్షణంనుంచి కులంలో నుంచే గాదు, హిందూ సొసయిటీలోనుంచే వెలే శేసీను. కులం వెలి మీాదమీాదనుంది. రేస్కా డిఫమేషణ. తెల్లవాడి జెండా ఎగురుతున్నన్నాళ్లు నా ఆస్తికేమి భయం లేదు గదా. నా రత్నమాల సహజమైనట్టి ఔదార్యంగల స్త్రీరత్నం. నాకు సహాయం జేయదూ... ఓ తప్పుక జేయును. తథాస్తు. (నిష్క్ర.)

---

## రంగము - ౨

---

౨ రంగము.

[రత్నమాల గృహం—చావిడి]

[ముసిల్ది ప్రవేశము గుమ్మందగ్గర కూర్చొంది]

ముసిలిది—విద్దం కాదుకాని మా పానాల తీసేస్తోంది. ఎనపై రూపాయ ల్లేనిదే సీర ఇవ్వరంట. తలనూనె కరీదు సీసా

రెండు రోపాయిల పావలా అయితే ఎనాగ బతకడం? నెలకి రెండుబందలు ఖర్చయితే మా అమ్మి ఆర్జించీ దేటి. జంపోళ్ళ రాజు గట్టించిన మేడ సూత్తే నాకెంతో సంతోచం ఏస్తాది. కరువుకు పుట్టినోళ్లు నాగున్నారు ఈ కాలపోళ్లు; ఒకడైనా పట్టుమని గుప్పెడు కాసులు కలోడే లేడు. చావిడి దాటి నోపల కాలెట్టడానికి తగినోడేకన్పించడు. పోని మేలాల్కి- ఒప్పుకేయే అంటే, అబ్బో వల్లమాలిన తల్లి మాయమ్మి. తనకి తోచదు. సెపితే యిన్దు. పువ్వాలకే రోజుకి పావలా అయితేని ఇక నేటి? ఆళ్ళందరూ ఎవురు సెప్మా. కొత్తో ళ్లొస్తున్నారు.

[శాస్త్రి, నరిసింహం, రంగారావు ప్రవేశింతురు]

శా—ఏం అవ్వా! రత్నమాల ఇంట్లో వుందిగా?

ము—ఎవరు బాబూ మీరు?

శా—ఎవరయితేనేం పదండి. ఇంట్లో ఉందిగామోను.

ము—ఓ, స్సాగవయ్యా పంతులూ. నేద య్యింటో నంటే; ఏటా తొంద రనాగతోసుకొనె శ్తావు?

శా—ఇంట్లో లేదు? ఎక్కడికి కెళ్ళింది?

ము—నీ పేరేటయ్యా?

శా—పేర్నుపట్టి చెబ్తావేం ఎక్కడికి కెళ్ళింది?

ము—కాకపోతే మరేటి? మా అమ్మి అంటే ఎవురనుకున్నావు?

శా—మీ అమ్మి! చెప్పమంటే గంతులేస్తావేం?

ము—నమ్మవేటి మొన్న సాయింత్రం బయ లెల్లిందంటేను?

శా—ఎక్కడికి?

ము—ఈయీది యీదంతా తెలిత్తే ఎక్కడకని అడుగుతా వేటి?

శా—నే నీ వీధివాడను గాను; నాకు తెలియదు చెప్పుముండా.

ము—ఏటయ్యో; నా గుమ్మంనో కొచ్చి గట్టిగ మాటోడుతు న్నావు; నానోరు మంచిదికాదు చుమా.

శా—ముసలమ్మా! రత్నమాల ఇంట్లో ఉందా లేదా?

ము—ఆగుమ్మంలో కాలు పెట్టకయ్యోయి. ఇంతమందితో ఒచ్చి నోడవు నీ కేం పనయ్యా ఇక్కడికి?

శా—ఒకమారు మాట్లాడాలి, చెప్పవూ?

ము—ఎవుడనుకున్నావేటి మా యమ్మి, నీ యిట్టం ఒచ్చినట్టు మాట్టాడ్డానికి? కంగు కుంగు మని రూపాయలు కంగితేనే యిన్నావా? నేకపోతే యెల్లు.

శా—మాట్టాట్టాంకే డబ్బు కావాలీ.

ము—మరేటి; అంతకన్న నువ్వునేసే దేటి?

శా—అయితే రత్నమాల ఇంట్లో ఉన్నట్టేనా?

ము—కాసీ రామేశ్రం యాత్ర యెల్లిందంటే నమ్మ వేటి?

శా—యాత్రా? సాన్లక్కూడా యాత్రలు కావాలీ?

ము—ఒద్దేటి! నీయంటోళ్లని మా యింటికి రానీయొద్దో దేవుడా అని పార్దించోద్దా?

శా—అమ్మ నీ దుంపా తేగా! నువ్వెంతదానివైతివే? నిజం చెప్పు, ఏమైనా ఇస్తా.

ము—నువ్విచ్చే దేటి నాకు? నేనే ఇస్తా నీకు.

శా—చెబుదూ ఉందేమో?

ము—ఏటి బావనోళ్లేకాని మేం నిజం సెప్పవంటయ్యా. మం చయ్యవే! మా అమ్మి నీ కెందుకు సెబుదూ?

శా—ఇక్కడికి ఈవాళ ఉమాకాంతం ఒచ్చాడా?

ము—ఏటి మాయింటికొచ్చీయాళ్ల పేర్లుకోసం అంటయ్యా ఒచ్చేవు? మే మనాగ సెప్పం. యెల్లెల్లు.

శా—నిన్న నొచ్చాడా?

ము—నేదు.

శా—మొన్న నొచ్చేడా?

ము—మొన్న నేటి; ఆ యయ్యకీ మా అమ్మికి పళ్లేదు. చానా ళ్లాయి రావడం మానీసీ డతగోడు.

శా—అహా

ము—అహా ఏటి; ఆయన ఇక్కడికి చానాళ్లాయి రానేదు. నువ్వు మా అమ్మికి తగవు. ఏటి ఎవరు రాకుండా గుమ్మాంకీ అడ్డంగి? ఎల్లెల్లవయ్యా. అచ లూళ్లో నేదు పో.

శా—ఏం నరసింహం! ఇ దో మో స్తరుగ తేలిందే?

న—ముసిలీ! అవును కాని, నీది అసలు మామిడిపిల్లి కాదూ?

ము—అయితే?

న—మర్నాదీ ఆవూరే కదటా. పెద్ద బుగతని నీకు తెలుసునా?

ము—తెలియకేం. అంతోటి మాహారాజు అంతోటి చరచుడు ఇప్పట్లో నేడే నేడు.

న—నా కతను పెదమేనమేమే. తెలుసునా?

ము—అనాగా. నువ్వు మంచోడివి; ఏటి అత నేటి ఎర్రెర్రగ మాట్లాడుతాడు.

స—నాకుచెప్పవు ఉమాకాంతంగురించి?

ము—నిజమే నే సెప్పింది. రామరామ నెల్లాళ్ళయింది ఇక్కడికి రానేదు.

న—మరి మమ్మలిని వెల్లమన్నావా?

ము—పన్నేకపోతే యెల్లండి.

(శాస్త్రి. నర. రంగ. ఒకతోవంట నిష్క్ర-)

[రెండవ తోవంట ఉమాకాంతం గుమ్మంముందు]

ఉ—అన్నా వీళ్ళిల్లు కాల్చియ్యా! ఎంత గట్టిగా కొట్టేరు! దాన్త్రండ్రి కోపంగా ఉందని తెలిసీ ఆ వీధిలోనికి వెళ్ళడం అంత బుద్ధితక్కువ వ్యవహారం, కాంగ్రెసు డెప్యుటేషన్టు ఇంగ్లండు తప్పితే, అదేకాని మరొకటికాదు. ఎంతటి కష్ట. కాలము అయిన ఆ పరమ కరుణాసింధువు తప్పకుండా ఏదోమార్గం చూపిస్తాడు. ఆ తప్పుకోడంలో ఆసందుమానీసి

ఈ వీధి వేపు పరుగెత్తడం, ఈయింటి వేపు రావడం, అందుకు దృష్టాంతం. లేకుంటే అధోగతిపాలయి పోవలసిందే! (గుమ్మం దాటి లోపలికి వెళ్ళి) ముసిలీ! ముసిలీ! వీధితలుపు వేసీ. ఎవ రొచ్చినా నే రాలేదని చెప్పు. వెళ్ళు. తలుపు వేసి వేగిరం. వెధవది వెర్రికుక్క ఒకటి వెంట తరుముతూందినన్ను. తలుపు వేసీ. లోపలిక్కాని రాగలదు.

అబ్బో! ఎంతగతి పట్టింది. కైలాసపర్వతంమీాద పుట్టి, భూమండాలినికిదిగి కొట్టుకొనకి అధోలోకంలో నణగిపోయీా గంగ లా గయిపోయింది, ఉమాకాంతం పంతులు గారి బ్రతుకు. ఇంతబతుకూ ఇంటివెనకాతలా అన్నట్టు అయింది.

ము—బాబూ! మీా రెందు కొచ్చే రిప్పుడు?

ఉ—ఎమిటలా గడుగుతున్నావు?

ము—కాదు తొందరగా ఒగురుస్తూ వస్తేని.

ఉ—చెప్పేకాను. వెర్రెకుక్క వెంటతగిలింది.

ము—మీారు రావడం మూ నీశేరు ఇప్పు డెందుకు?

ఉ—ఎందుకోనా? నే నెవరినో తెలుసునా?

ము—బాగుందండోయి?

ఉ—మరయితే పిల్లని గదిలోకి పిలువు?

ము—ఏం పిల్లండీ?

ఉ—మతి పోతూ ఉం దేమిటి?

ము—ఏటి ని మ్మల్ని సూశా?

ఉ—పిలుస్తావా పిలవ్వా? వీధితలుపు వెయ్యనే లేదతా. రా మొట్టమొదట. పిల్లనిపిలువు?

(ముసలిది వీధితలుపు వేసివచ్చును.)

ము—ఉళ్ళో నేదు.

ఉ—ఎక్కడికి వెళ్ళింది?

ము—కాచీ రామేశ్రచం యాత్రకి యెల్లింది.

ఉ—అంటే?

ము—యాత్ర కెళ్ళిందంటే;

ఉ—ఇదుగో ఈ రూపాయి తీసుకో; నే న్నీకు అస్యమా ఏమిటి? చెప్పు నిజం. చాలా అవసరం.

ము—అవిసరం ఉంటే కాని ఒత్తావా ఏటి నువ్విక్కడికి?

ఉ—నాతల్లివిగావు

ము—ఈ యుత్తరం సూసికోండి, నేను పెరట్లో కూకుడుంటాను. (ఒక ఉత్తరం కిటికీలోనుండి ఇచ్చి నిష్క్ర-)

ఉ—(చదివి) ఏమిటీ. వైరాగ్యం పుట్టిందీ. ఎవళ్ళ మీాద? నామీాదే; నా ప్రాణంకన్నా ప్రాణంలాగ చూసేవాడ్ని గదా. నా పంచప్రాణాల్లో నాలుగు ప్రాణాలు నా రత్నమాత్రే అని కాళ్ళమీాద పడి నిర్ధారణ చేయడానికి నే నింత మేరా వస్తే వైరాగ్యం పుట్టింది! అబ్బ! ఈ చమట నన్ను వదలదు కాబోలు (అని కోటు విప్పి మేకున తగిలించును)

ఏమటీ వేడి పొగర్ల వుపద్రం ...... ముసిలీ, ముసిలీ... పలుకదేం? పోనీ లోపలికి వెళ్లదాం మనమేను. రోకట్లో బుర్ర పెట్టి రోకటి పోటుకు వెరువడ మెందుకు? (అని తలుపువైపు వెళ్ళి తలుపు తీయబోయి) అరే లోపల గడియ పెట్టేశింది ముసలిముండ. అయితే నిజంగా వెళ్ళిపోయినట్లే.

నాలుగు వైపులనుండి కొడుతుందే తుపాను. అటెళ్తే గాలిదెబ్బ, ఇటెళ్తేవానదెబ్బ. ముందు కెళ్తేవడగళ్లదెబ్బాను ఈ జీవుడే దరికైనా చేరడాన్కి వీలుందా లేదా? అయ్యో మొదట రాముక్కమారి ... మనసా ఇంకా మరిచిపోలేదా సంగతి మరిచిపో.

రత్నమాలా! రత్నమాలే నన్నే ఒడ్డైనా ఎక్కిస్తుందనుకుంటే నన్ను వదిలీసిందే; నాలుగు వేపులా వెళ్ళేసరికి లవ్ కుదిరిందికాదు; ఏ రోలింగు స్టోన్గాదర్సు నో మాసన్నట్టుల ఇంక నాకు దిక్కెవరు? వీధిలోకా వెళ్లలేను. ఇంటికా పోలేను. ఇక్కడా నువ్వులేవు. నా కింక ఈ లోకంలో జీవనోపాయం ఏలాగు? నామీదంటే అసహ్యమయితే నేమోసరిగాని, నీ యిల్లు నీ వాకళ్లు నీ వెండి బంగారములు మీద అసలు వర్ణనాతీతమయిన నీవయసు, నీయందం నీ బ్రతుకు మీద వైరాగ్యం బుట్టిందా?......ఇంక నా కక్కనపడవూ? ......నీ మొహం అయినా చూడ్డానికి నోచుకోలేదా

...... (రత్నమాల తలుపు నిశ్శబ్దముగ తీసి నించొనును) ఏదో తెలివిమాలినపని చేసినందుకు నన్ను క్షమించక నీ ఔదార్యం అంతాఏమి జేసేవు? అబ్బా! మరి కనిపించవూ? నీ నవ్వు లేవీ?నీ కేలింత లేవీ?నీపెదివ పిరుపు లేవీ? నాకు గల ఆ స్తంతా నీవేకదా?

రత్న—అవునండి. తమా స్తియే కాని జారిపోయిందండి.

ఉ—రత్నం! (అని వెనక్కు దిరిగి జూచులోపున తలుపు నిశ్శబ్ద ముగామూసివేసినిమ్క్రు)రత్నమాలా! ఎక్కడా? ఎక్కడ్నుంచి నీ పలుకులు; ఏ మామిడికొమ్మ మధ్యనుండి నీ వాంగ్మాధు ర్యం? నా తప్పు క్షమించవూ? (కలయ జూచుచు) నీ కాళ్ల మీాద పడడానికి వచ్చేను. నిన్ను ముట్టుకోనివ్వవూ? ఏం నీ బుగ్గలేమి అలా గున్నాయి? నీ పెదివ లేమి వాడిపోయేయి. దా మాట్లాడు. ఎక్క డున్నావు? కనిపించవూ?......ఆ ఆ కనిపించి పారిపోయేవా.........ఇది నిజమేనా? కలగాదు గద. కొంపతీసి మరేమయినా......ముసిలీ ముసిలీ...... ముసిలీ! రత్నం మరేం సాహస ప్పని జెయ్యలేదుగదా?... ఛఛా! నిజంగా మతిబోతుందా? ఏమిటి. సరిగ్గా గొంతుక స్వచ్ఛంగా వింటే కలేమిటి?...రత్నం (రత్నమాల ప్రవేశిం చును)...హామ్యో...ఓ రత్నం నా రత్నం నన్ను రక్షిం చవూ (అని కౌగలించుకొనబోవును, రత్నమాల తప్పించు

కొనును; ఆ తొందరలో ఉమాకాంతం కాలి కేదో తగిలి కిందకు జోగిపోయి గోడమీద పడి ముఖము తడుముకొనును)

ర—మిమ్మల్ని రక్షించేవాళ్లు పైవా ళ్లున్నారు. పాపం అద్దం ఇద్దునా మొహం జూసుకోందుకి?

ఉ—అస్యంకాదు, ఇదిగో (అని కాళ్లమీద పడపోవును)

ర—చాల్చాలు మీ నక్క-వినయాలు, మీరున్నూ. ఇక్కడికి మిమ్మ ల్నెవ ర్రమ్మన్నారు.

ఉ—పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణ పోకటానున్నూ. వీధిలోకి వె ళ్తే ఈ శరీరం నాది కాదిక.

ర—అయితే నేనే కొనకు దిక్కయేనా?

ఉ—దిక్కులేని వారల కెల్ల దిక్కెవండు అన్నట్లు నువ్వే నాకు దిక్కు. జరిగిన దంతా నీ దగ్గర కన్ఫెష న్జే సీస్తాను; మరి న న్నేమి అనకు, బతిమాలుకుంటున్నాను. నిజంగా కాశీ వెళ్ళి పోయేవని మనసుకి తోచీసరికి పంచప్రాణాలు ఎగిరి పో యేయి. విధి వశాన్ని మళ్ళీ నిన్ను కలుసుకోవడం భాగ్యం ఉండీ ఈగూట్లో జీవుడు నిలిచింది. నువ్వే నన్ను రక్షించాలి.

ర—ఏం చెయ్యాలి?

ఉ—ఈ రాత్రి ఎకాయెకీ ఈవూళ్ళో పిక ల్లేకుండా పారి పోవాలి. ఓమూల్ని అప్పులబాధ, మరోమూల్ని ప్రాణభయంన్నూ.

ర—ఇప్పుడైనా తమరు మొదట నాకు వాగ్దానంచేసినలాగు చేయడానికి ఒప్పుకుంటే—

ఉ—ఇంకా ఒప్పుకోడం అంటా వేమిటి? - మరోపూళ్ళో మేడ, నౌకర్లు వివాహప్రయత్నాలూ అన్నిటిని బ్రహ్మకి తెలియకుండ పరమ రహస్యంగ యెత్తం జేసి అట్టె బెడితేను. ఒప్పుకోవడం ఏమిటి? నీముద్దుపాదాల్ని కళ్ళ అద్దుకుంటూంటేను.

ర—నిశ్చయమేనా?

ఉ—అభ్యంతరమేమిటి? (అని పాదములు బట్టబోవును)

ర—(ఆపి) నేను వేశ్యనుమీరు బ్రాహ్మర్లు; మీాకభయం నేనిసున్నాను. మరి వినండి.

ఉ—ఒకమారు నిన్ను ముద్దుబెట్టుకోనిమ్మని అడిగితే కోప్పడవుగదా.

ర—ఏం వేషాలు?

ఉ—రత్నామాలా! ఇప్పటికి నాగుండెలు కుదుట బడ్డాయి. మరేం అడ్డురాకుండా దేవుడ్ని ప్రార్థిస్తున్నాను.

ర— ప్రార్థన ఒకటేం?

ఉ—అలాగకాదు. ఇటుపైని విన్నావా మనలైఫ్ మోస్టు రోమాంటిక్ షెల్లీ బైరను వెతుక్కు వెతుక్కుని దొరక్క కొట్టుకొనకి చచ్చేరే రోమాన్సుకోసమని, ఆ రొమాన్సంతా మనదే. మనం చేసే పని శాస్త్రియుక్తం అయిందని మాత్రం మనసులో బెట్టుకో. టూ బర్డ్సు టేపాటన్నట్టు, నీకులాంకి సోషల్రిఫార్మ్; ఇంటర్కాస్టు మేరేజి, రెండు. నిశ్చయంగా

సోష ల్రిఫార్మంటే చ్చేయడానికి తలపాతకున్నా అందరికి వీలవుతుందా? ఫ్యూ ఆ ర్ద్ చోజెన ఫ్గాడ్, ఇన్నాళ్లక్కడా నా ఎంబిషన్ ఫుల్ఫి ల్లయింది; దేశాన్కి సోషల్రిఫార్మంటే ఏమిటో చూపించడానికి వీలయింది. ప్రాక్టిసీ జ్బెట ర్దేన్ప్రిస ప్టన్నారు. అందులో బ్యూటీ ఏమిటంటే అయి డూ నాట్ ప్రీ చ్వా టయి హేవ్ నా టూ ల్రడీ ప్రాక్టిస్డ్. (రత్నమాలనుకౌగ లించుకొనును)

(తెర దిగును)


DBA000005910TEL